MY CANDYMAN ADVENTURES




# ఎవరి బాక్స్ ఇది?





























# Double the mazaa with *Choco Double.*




Spot the doubles in this picture.










**Just three steps for winning many exciting Candyman Prizes:**

- Answer the question.
- Complete the slogan 'I like Candyman because...' in not more than 10 words.
- Complete all the details about yourself and send it by August 30, 2008.

**Ramya.B, Chandamama India Ltd., 6th floor, Block A, JVL Plaza, 626, Anna Salai, Teynampet, Chennai - 18**

**OR,** e-mail us before 30th August 2008 at **candyman@chandamama.com**

How many doubles (pairs) do you see in this picture? (Not including the characters) ..............................

I like Candyman because ..............................

Name: .............................. ☐Boy ☐Girl Age: .......... Address: ..............................

.............................. Ph. No.: ..............................

School: .............................. Class: .......... E-mail ID: ..............................

CANDYMAN

DRAFTFCB • ULKA 850552

**TERMS AND CONDITIONS**

1. This contest is open to all residents of India.
2. The participants understand that sending entries implies acceptance to the terms and conditions of this contest.
3. The entries for this contest shall be sent by ordinary post to Ramya.B, Chandamama India Ltd., 6th floor, Block A, JVL Plaza, 626, Anna Salai, Teynampet, Chennai 18 on or before August 30, 2008.
4. Incomplete and/ or illegible entries shall be disqualified.
5. This contest is not open to employees of ITC Limited and Chandamama India Ltd and their family members.
6. ITC Limited reserves the right to extend, cancel, discontinue, withdraw, change, alter or modify this contest or any of the terms thereof with or without notification and without assigning any reason.
7. The winners of this contest shall be selected by a panel of judges appointed by ITC Limited.
8. The decision of ITC Limited will be final and binding with regard to any dispute arising out of this contest and is non contestable. No correspondence shall be entertained in this regard.
9. The prizes shall be sent to the winners at the addresses specified in the entries sent by them and ITC Limited shall not be responsible if the winners are unavailable at such addresses.
10. ITC Limited and Chandamama India Ltd shall not be liable for incorrectly addressed or undelivered entries or for the disruption, delay or non-receipt of entries due to postal delays or any other reason.
11. Prizes are non-transferable, non-negotiable, subject to availability and cannot be exchanged for cash.
12. ITC Limited shall not be liable for any loss, expense or damage which may be suffered in connection with this contest or accepting or using any prize given under this contest.



**నన్ను బంగారంతో చుట్టండి.**






500 ఎర్రటి [illegible]*



25 [illegible]*

పిల్లల్లారా! పైన ఇచ్చిన ఆకృతిని మీకిష్టమైన ల్యాక్టో కింగ్ ర్యాపర్లతో నింపి అది మహారాజు ఆకారం పొందడాన్ని గమనించండి. దాన్ని పూర్తి చేయగానే మాకు పంపడానికి మరవకండి. కొన్ని ఆకర్షణీయమైన బహుమతులు* మీకోసం వేచివున్నాయి.

మీ ఎంట్రీలను పంపవలసిన చిరునామా:

మార్కెటింగ్ కో ఆర్డినేటర్
లోటె ఇండియా కార్పొరేషన్,
మురుగేశన్ కాంప్లెక్స్,
కొత్త నెం. 84, గ్రీమ్స్ రోడ్,
థౌసండ్ లైట్స్,
చెన్నై - 600 006.






LOTTE
Lacto King

శుద్ధమైన పాలు. శుద్ధమైన నెయ్యి.





చందమామ సంపుటి: 61 ఆగస్ట్ 2008 సంచిక:08



వ్యవస్థాపకులు
బి. నాగిరెడ్డి - చక్రపాణి

## ఈ నెల విశేషాలు



మంచి శత్రువు (బే.క) ...19



సాధువు వింత నిబంధన! ...39



అంతుచిక్కని నానా రహస్యం! ...44



రామాయణం (సుందరకాండ - 3) ...57

## అమరవాణి

ఎంత
హీనస్థితికి వచ్చినా
ధీరుడి ధైర్యం
తుడిచి
పెట్టుకు పోదు;
తల్లకిందులు
చేసినా అగ్నిజ్వాల
కిందికి
ప్రసరించదు!

## ఈ సంచికలో...





# సమున్నత దేశ నిర్మాణం కోసం

అరవై సంవత్సరాల క్రితం అంటే మన ప్రథమ స్వాతంత్ర్య దినోత్సవం సందర్భంగా 1948 ఆగస్ట్ చందమామ 'పెద్ద పండుగ' గురించి ప్రస్తావించింది. మనదేశంలో ఉగాది, సంక్రాంతి, దీపావళి, దసరా, రంజాన్, క్రిస్మస్ అంటూ ఎన్నో పండుగలు జరుపుకుంటాం. అయితే, అవన్నీ కూడా ఒక ప్రాంతం, ఒక భాష, ఒక మతం ప్రజలకు మాత్రమే పరిమితమైనవి. అయితే ప్రాంతీయ వ్యత్యాసాలు, భాషా భేదాలు, మత తారతమ్యాలు పాటించకుండా దేశ ప్రజలందరూ జరుపుకునే 'పెద్ద పండుగ' స్వాతంత్ర్య దినోత్సవం అనీ; స్వాతంత్ర్యంకోసం పోరాడిన త్యాగమూర్తులను స్మరించుకుని వారి అడుగు జాడల్లో ఐకమత్యంతో నడవాలనీ ఆనాటి సంపాదకీయం పిల్లలకు పిలుపునిచ్చింది.

మన సంస్థానాధిపతులు ఐకమత్యంతో పోరాడి ఉన్నట్టయితే 1857లో జరిగిన ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం ద్వారానే విజయం సిద్ధించి ఉండేది. ఐకమత్యం లేకపోవడం వల్లే అది విఫలమయింది. ఈనాడు సంస్థానాధీశులులేరు. ప్రజల అభ్యున్నతి కోసం ఐకమత్యంతో ఆలోచించి, తగిన చర్యలు తీసుకోవలసిన బాధ్యత మన నాయకుల మీద ఉన్నది. నాయకులంటే ఒక్క రాజకీయ నాయకులే కాదు. సమాజంలోని వివిధ రంగాలకు చెందిన నాయకులందరూ దీనిని గుర్తించాలి. నిజాయితీతో, సమైక్యభావంతో యువతరానికి దారి చూపవలసిన అవసరం ఉన్నది.

దేశ స్వాతంత్ర్యం కోసం పోరాడిన దేశభక్తులను ముఖ్యంగా–స్వతంత్రం అన్న మాటను పలకడమే ప్రమాదకరమని భావించిన ఇరవైయవ శతాబ్దారంభంలో సంపూర్ణ స్వరాజ్యం కోసం పోరాడిన మహనీయులను స్మరించుకుని వారి అడుగుజాడల్లో ముందుకు సాగుదాం. సంపూర్ణస్వరాజ్యం కోసం పిలుపునిచ్చిన శ్రీ అరవిందుల జన్మదినం రోజే దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించడం విశేషం. ''స్వాతంత్ర్యం నా జన్మ హక్కు. దానిని సాధించి తీరుతాను,'' అన్న నినాదంతో జాతిని జాగృతపరచిన బాలగంగాధర తిలక్ మరువరాని మహనీయుడు. అలాంటి మహనీయుల స్ఫూర్తితో ముందుకు సాగుదాం. అందరికీ సుఖశాంతులు లభించే అంతరాలు లేని సమున్నత దేశనిర్మాణానికి పాటుపడదాం!

సంపాదకుడు : **విశ్వం**

Visit us at : http://www.chandamama.com





చందమామ

**Editor, Publisher :** B. Viswanatha Reddi (Viswam)
**Chief Executive Officer :** L. Subramanyan
**Editorial Advisors :** Ruskin Bond, Manoj Das
**Consultant Editor :** K. Ramakrishnan
**Associate Editor :** A.R. Balasubrahmanyam
**Senior Artists:** K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh
**Artist :** Jayapandian
**Assistant Editor :** R. Sudha
**Creative Writer :** R. Vaasugi
**Layout Designer :** B.A. Hemalata Malini

**CIRCULATION TEAM :**
**Chennai : T N Ravi Shankar, National Sales Manager**
Mobile +91 99620 70014
email : ravishankar.tn@chandamama.com
**Fazal Khan, Manager-Circulation & Institutional Sales**
Mobile +91 99625 67860
email : fazal.khan@chandamama.com
**Mumbai : Rajendra K Jadhav, Asst. Manager - Circulation**
Mobile +91 9271720669
**CHANDAMAMA INDIA LTD.,** B-3, Lunic Industry
Opp. State Bank of India, Near Police Station Cross Road
No.6, MIDC Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
email : rajendra.jadhav@chandamama.com
**New Delhi : Sushil Sharma, Circulation Manager-North**
Mobile +91 98719 30767
**CHANDAMAMA INDIA LTD.,** Goyal Business Centre,
C-23/2 First floor, Connaught Place, New Delhi-110001
**Bangalore : P. Murali, Asst. Circulation Manager -Karnataka**
Mobile +91 94488 36952
**CHANDAMAMA INDIA LTD.,** 18, 10th Cross, Mayura Street
Papanna Lay Out, Outer Ring Road, RMV 2nd Stage
Bangalore-560094, Phone +91 80 6655 1000
email:murali.p@chandamama.com
**Kolkata : Ananth Prakash, Circulation Manager-East**
Mobile +91 98362 82202
email : ananth.prakash@chandamama.com
**Advertisement :** email : sales@chandamama.com
**Business Dev and Online : Surajit Agarwal**
email : surajit@chandamama.com
**Subscription Queries:** L Govindasamy
e-mail : govindaswamy.l@chandamama.com
**Other Queries:**A B Sairam Mobile: +91 9841983774
e-mail : sairam.ab@chandamama.com
**Head Office : CHANDAMAMA INDIA LTD.,**
JVL Plaza, Block-A, 6th Floor, 626, Anna Salai, Teynampet
CHENNAI-600018, Phone +91 44 2432 2101/02,
Fax +91 44 2432 2103
email : chandamama@chandamama.com
Website : www.chandamama.com

చందా

ఇండియాలో బుక్‌పోస్ట్ ద్వారా రూ. **180.00**

చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారాగానీ, మనిఆర్డర్ ద్వారాగానీ 'చందమామ ఇండియా లిమిటెడ్' పేరిట పంపండి.


# పాఠకుల లేఖలు

రూ. **250/-** బహుమతి పొందిన లేఖ

'చందమామ వచ్చింది, కమ్మటి కథలు తెచ్చింది' అని తెలియగానే అన్నం కూడా మాని పుస్తకాల దుకాణానికి పరిగెత్తే రోజులు ఇప్పటికీ మారలేదు. మారబోవు. ఎందుకంటే ఇది అందరాని 'చందమామ' కాదు. అందరి 'చందమామ'. ఎన్నో చల్లని కథా కౌముదులు 'చిందు' మామ!

హాస్యం, సమయస్ఫూర్తి, తర్కం, న్యాయం, కాల్పనికత, విశ్లేషణ, విలువలు, చరిత్ర, పురాణం-ఇలా చందమామ స్పృశించని కథావస్తువుగాని, అంశం గాని లేదు.

వృత్తిపరంగా ఎన్నో ఒత్తిళ్ళకు, ఏవేవో తిళ్ళకు-మెదడునీ, శరీరాన్నీ బలిపెడుతున్న ఈ రోజుల్లో తరగని నిధి, దేవుడికి అవకాశం, పరుసవేది, జ్ఞాపకశక్తి, రాజుగారి కోతి, తీరిన కోరిక, పుకారు, ప్రయోజకుడు వంటి కథలు గుండెలోతుల్ని తాకుతాయి.

'జూన్' పత్రికలో ప్రచురించిన 'మాలతీ చందూర్' గారి జ్ఞాపకాల పుటల్లో దొరికిన కథ-కోడిగుడ్డంత ధాన్యపుగింజ చదివినంత సేపూ ఒక అనిర్వచనీయమైన అనుభవానికి లోనయ్యాం. సామ్యవాద దృక్పథాన్ని, బడా బాబుల దోపిడీతనాన్ని, కలసి ఉండడంలోని సుఖాన్ని, పంచుకోవడంలోని మంచితనాన్ని రంగరించి, రంగులద్ది అందించిన ఈ కథ చదువుతున్నంత సేపు 'ఇదీ' అని చెప్పలేని ఉద్వేగానికి లోనయ్యాం. 'బాలల' కోసం ప్రత్యేకంగా కొన్ని పుటలు కేటాయిస్తే బావుంటుంది. వారి రచనలు-పాఠశాల అనుభవాలు, బొమ్మలు, వారు చేసిన మంచి పని, స్నేహితుల నుంచి నేర్చుకున్న మంచి మొదలైన విశేషాలు. అలాగే ప్రతి పత్రికలో ముగింపు లేకుండా కథను ప్రచురించి-చక్కటి ముగింపు సూచించే పోటీలు, కథా శీర్షికసూచించేపోటీలు-వంటిని కూర్చితే కంప్యూటర్లకే అంకితమైపోతున్న సగటు బాలలు బుర్రకి పదును పెడతారు. 'చందమామ' మరింతగా ఆబాలగోపాలాన్ని ఆకర్షిస్తుంది. -శ్రీమతి తిరుమల రెడ్డి సాయి ప్రసన్న రవిశంకర్, పుప్పాలగూడ, హైదరాబాద్ - **500 075**



# నట్టింట్లో పిశాచి

పెదపాడులో ఉండే పెద్దయ్య తనకున్న మూడెకరాల పొలాన్ని కష్టపడి సాగు చేసేవాడు. ఆయన భార్య పెద్దమ్మ సంసారాన్ని గుట్టుగా నెట్టుకు వచ్చేది. ఆ దంపతులకు ఇద్దరు కొడుకులు; ఇద్దరు కూతుళ్ళు. పెద్ద కొడుకు పెద్దన్నకు పద్దెనిమిదేళ్ళొచ్చాక పొలం పనుల్లో తండ్రికి అందొచ్చాడు. ఇంటి పనుల్లో తల్లికి సాయమవసరమని పెద్దన్న ఇరవై యేళ్ళకే పద్దమ్మ అనే యువతిని పెళ్ళిచేసుకున్నాడు. అయితే, ఆమె కాపురానికి వస్తూనే వేరు కాపురం పెట్టమని పోరసాగింది.

ఇలా ఉండగా ఒకనాడు పెద్దయ్య ఎడ్ల బండిపై నుంచి కిందపడ్డాడు. నడుముకు బలమైన దెబ్బలు తగిలాయి. చికిత్స చేసిన వైద్యుడు ఆయన ఇక కష్టమైన పనులు చేయకూడదన్నాడు. అలా నలభైయేళ్ళకే పెద్దయ్య, ఇంటి బాధ్యతలను ఇరవైయేళ్ళ కొడుక్కు అప్పగించవలసివచ్చింది. పెద్దన్న ఇరవైయేళ్ళ పాటు పగలనక, రాత్రనక శ్రమించి-చెల్లెళ్ళ పెళ్ళిళ్ళు చేశాడు. తమ్ముణ్ణి వృద్ధిలోకి తీసుకువచ్చాడు. అతడు పట్నంలో స్థిరపడ్డారు. ఇప్పుడు పెద్దన్న పెరిగిన ఆదాయంతో ఎంతో తృప్తిగా ఉన్నాడు. అయితే అతడి భార్య పద్దమ్మకు మాత్రం తృప్తిలేదు. ఆమెకు అత్తమామల పొడగిట్టదు.

ఒకనాటి సాయంకాలం పాము పెరట్లోంచి వచ్చి తన గదిలో దూరడం చూసింది పెద్దమ్మ. కోడలికి చెబితే ఆమె చూడనట్టు నటిస్తూ, ''పామెక్కడ? నాకు కనబడదేం?'' అన్నది. పాముతోనైనా అత్తమామల పీడ విరగడ కావాలన్నది ఆమె ఆశ.

పెద్దమ్మ ఎవరినైనా పిలుస్తానని వీధి గుమ్మంలోకి వెళ్ళింది. అప్పుడే అలా వెళుతూన్న నాగయ్యతో విషయం చెప్పింది. వెంటనే

జొన్నలగడ్డ రామలక్ష్మి



వాడు కళ్ళుమూసుకుని మంత్రం పఠించి, ''కాసేపట్లో నీ ఇంట్లోని సర్పం నీరస పడిపోతుంది. దానివల్ల నీకే హానీ ఉండదు. ధైర్యంగా ఉండు,'' అని చెప్పి వెళ్ళిపోయాడు.

సరేనని లోపలికి వచ్చిన పెద్దమ్మకు అప్పుడే తన గదిలోంచి బయటకొచ్చి కోడలివైపు వెళుతూన్న పాము కనిపించింది. పద్దమ్మ కెవ్వుమని అరిచి ఉన్నఫళంగా కుప్పలా కూలిపోయింది. ఈలోగా పాము చరచరా పాకుతూ పెరట్లోకి వెళ్ళిపోయింది.

అప్పటి నుంచీ పద్దమ్మ నీరసంతో మంచం పట్టింది. వైద్యుడు వచ్చి చూసి, ఆమె జడుసుకుందనీ నెమ్మది మీద నయమవుతుందనీ అన్నాడు. రెండు వారాలు గడిచినా పద్దమ్మ నీరసం తగ్గలేదు. కానీ, ఇంటి పనులన్నీ అత్త మీద పడ్డందుకు మనసులో మహా సంతోష పడింది. తల్లికి సాయంగా చుట్టాలను పిలవడమో, పనిమనిషిని కుదర్చటమో చేయాలనుకున్నాడు పెద్దన్న. కాని పద్దమ్మ అందుకు ఎంతమాత్రం ఒప్పుకోలేదు.

పద్దమ్మ మంకుతనం గురించి ఊళ్ళోనే కాదు; ఊరినానుకునివున్న చింతతోపులోని పిశాచాల మధ్యా ప్రచారమయింది. అక్కడి పిశాచాల గుంపులో మోహిని అనే పిశాచి వయసుమళ్ళినపిశాచాలను అల్లరిపెడుతూ ఆనందించేది. దాని బాధలు పడలేక ముసలి పిశాచాలు పెద్దతో మొరపెట్టుకున్నాయి. పిశాచాల పెద్ద, ''నువ్వు పెదపాడు వెళ్ళి, నీలాంటి స్వభావమేగల పద్దమ్మ ఇంట్లో మూడు నెలలు పనిచేసి రావాలి. అప్పుడే నీకు మా గుంపులో స్థానం,'' అని మోహినికి శిక్ష విధించింది.

గుంపును వదిలి ఉండలేని మోహిని, అలాగే చేయాలనుకుని పెదపాడు చేరి, అందమైన యువతి రూపంలో వెళ్ళి పద్దమ్మ ఇంటి తలుపుతట్టింది. తలుపు తీసిన పెద్దమ్మ, ఆమె పనికోసం వచ్చిందని తెలుసుకుని కోడలి వద్దకు తీసుకువెళ్ళింది. ఆమె మోహినిని నిర్లక్ష్యంగా చూస్తూ, ''రోజూ ఇల్లంతా తుడిచి సామాన్లు సర్దాలి. స్నానాలకు నీళ్ళు తోడాలి. వంట చేయాలి. అంట్లు తోమాలి. బట్టలుతకాలి. రెండు పూటలా తిండి పెడతాం. నెలకో వరహా జీతమిస్తాం. ఇష్టమైతే పనిలో చేరు,'' అన్నది.

పద్దమ్మ షరతులకు మోహిని ఒప్పుకున్నది. దాంతో పద్దమ్మకు ఉక్రోషమొచ్చి, ''ఒకసారి ఒప్పుకున్నాక కనీసం నెలరోజులైనా పని

చేయాలి. మధ్యలో వెళ్ళనివ్వను. బాగా ఆలో చించుకో,'' అని హెచ్చరించింది.

మోహిని నవ్వి, ''మూడు నెలల దాకా ఈ ఇల్లొదలను. మధ్యలో పొమ్మన కూడదు. సరేనా?'' అన్నది.

పద్దమ్మ ఇంకేమీ అనలేక మోహినిని పనిలో చేరమన్నది. అయితే, ఎలాగో అలా ఆమెను బెదరగొట్టి ఒకటి రెండు రోజుల్లో ఇంటి నుంచి తరిమేయాలనుకున్నది.

మోహినికి అతీత శక్తులుండడంతో ఎంత కష్టమైన పనిచెప్పినా అవలీలగా చేసేది. మోహిని రాకతో పెద్దమ్మకు ఇంటిపనులు తప్పాయి. కొడుకూ, కూతుళ్ళూ వచ్చి కొన్నాళ్ళు సంతోషంగా గడిపి వెళ్ళారు. ఇరుగు పొరుగు పిల్లలతో ఇల్లు సందడిగా ఉంటోంది. ఆమెకెంతో తృప్తిగా ఉంది. అత్త సుఖ పడడం పద్దమ్మకు ఇష్టంలేదు. ఎలాగైనా తప్పులెంచి మోహినిని పంపేయాలనుకుని ఒక రోజు నీళ్ళు తోడి గుండిగలు నింప మన్నది. పెరటి చెట్టు కొట్టి కట్టెలు చీల్చమన్నది. మోహిని అన్నీ అవలీలగా చేసేస్తే ఏమనాలో తెలియక బయటి పిల్లల్ని ఇంటికి రానివ్వద్దన్నది. మోహిని ఒప్పుకోక, ''చెప్పిన పనులన్నీ చేస్తున్నాను. పిల్లలు వస్తే నీకు ఏమి ఇబ్బంది?'' అన్నది.

''ఎదురుప్రశ్న వేయకు. చెప్పింది చెయ్. లేకుంటే వెళ్ళిపో,'' అంటూ గుడ్లురిమి చూసింది పద్దమ్మ.

''అలా చూడ్డం నాకూ వచ్చు,'' అంటూ పిశాచి ముఖంతో కళ్ళెర్ర చేసింది మోహిని.



పద్దమ్మకు గుండెలవిసిపోయి, ''పిశాచి! పిశాచి!'' అంటూ కేకలు వేసి ఇంట్లో వాళ్ళను పిలిచి జరిగింది చెప్పి మోహినిని ఇంట్లోంచి పంపేయమని చెప్పింది.

పద్దమ్మ మనస్తత్వం తెలిసిన వాళ్ళా మాటలు నమ్మకుండా, ''మోహిని పిశాచే కావచ్చు. అయితేనేం, ఆమెవల్ల మనందరికీ మేలే తప్ప ఎలాంటి హానీ జరగడం లేదు కదా! ఆమెను ఇంట్లోంచి పంపడమెందుకు?'' అన్నారు.

పద్దమ్మ కోపంగా, ''తెలిసి తెలిసి నట్టింట్లో పిశాచిని ఉంచుకుంటామా? మీరు నామాట నమ్మకపోతే మంత్రగాడు నాగయ్యను రప్పించండి. ఆయనే, దాని బండారం బయట పెడతాడు,'' అన్నది.

పెద్దయ్య నాగయ్య దగ్గరికి వెళ్ళి విషయం చెప్పి ఆయన్ను వెంటబెట్టుకుని వచ్చాడు.

నాగయ్య పెద్దయ్య ఇంటి ముందాగి, ''అవును, నట్టింట్లో పిశాచి ఉన్న మాట నిజమే. దానికి కాళ్ళు చేతులు పడిపోయేలా చేస్తాను,'' అంటూ కళ్ళు మూసుకుని మంత్రోచ్చారణ చేశాడు. కొంత సేపటికి పద్దమ్మకు కాళ్ళు చేతులు పడిపోవడంతో, ''అంతా కుట్ర! ఇంట్లో అందరూ కలిసి నన్ను చంపడానికి మంత్రం ప్రయోగించారు,'' అని కేకలు పెట్టసాగింది.

అందరూ మంత్రగాడికేసి చూశారు. అతడు తల పంకించి, ''ఆహా, నువ్వు అసాధారణ వ్యక్తివి. నీ మూలంగా నా మంత్రశక్తి తెలియవచ్చింది,'' అన్నాడు పద్దమ్మతో.

''ఏమిటినువ్వంటున్నది? నువ్వు పాము మీద, పిశాచం మీద ప్రయోగించిన మంత్రాలు నా మీద పనిచేశాయి. ఏమిటిదంతా?'' అన్నది పద్దమ్మ ఆవేదనగా.

నాగయ్య నవ్వి, ''రూపాన్ని బట్టి మనిషి సృష్టిలోని ప్రాణుల్ని గుర్తిస్తాడు. కానీ, మంత్ర శక్తికి స్వభావంతోనే తప్ప రూపంతో నిమిత్తం లేదు. ఆ రోజు పాము మీ ఇంట్లోకి యాదృచ్ఛికంగా వచ్చిందే తప్ప ఎవరికీ హాని తలపెట్టి కాదు. అయితే నువ్వు పాముకంటే ఎక్కువగా అత్తమామల మీద పగబట్టడం వల్ల నేను వేసిన మంత్రం నీకే శాపమయింది. ఇంట్లో చేరిన పిశాచి మోహిని మీకు సేవలు చేసిందే తప్ప కీడు తలపెట్టలేదు. కానీ నువ్వు పిశాచంలా ఇంట్లోని వారిని పీడించడం వల్ల నా మంత్రం నీ మీదే పనిచేసింది. మనిషి జన్మ ఎత్తినా మనిషి బుద్ధులు లేని అసాధారణ వ్యక్తివి నువ్వు. అందువల్లే పాముకూ, పిశాచానికీ ఉద్దేశించిన మంత్రాలు నిన్ను బాధించాయి. నా మంత్ర ప్రభావం తొలగిపోయి మామూలు మనిషి కావాలంటే నువ్వు మంచి బుద్ధులు, సత్ప్రవర్తన అలవరచుకోవాలి. అర్థమయిందా,'' అని చెప్పి వెళ్ళిపోయాడు.

తన దుస్థితికి కారణం తెలుసుకున్న పద్దమ్మ సిగ్గుతో కుంచించుకు పోయింది. ఆ క్షణం నుంచి తన ప్రవర్తనను మార్చుకున్నది. క్రమంగా ఆమెకు జబ్బు తగ్గి మామూలు మనిషయింది. ఆ ఇల్లు సుఖసంతోషాలకు నిలయమయింది.






# పాతాళదుర్గం

కుంతలదేశపు మంత్రి కొడుకైన శశికాంతు డొకనాడు, భద్రుడూ, జయంతుడనే మిత్రు లిద్దరిని వెంటబెట్టుకుని, వేటకై అరణ్యానికి వెళ్ళాడు. అరణ్యంలో లేళ్ళూ, దుప్పులూ, అడవిపందులూ సమృద్ధిగా వున్నవి. కాని, శశికాంతుడూ, అతడి మిత్రులూ వాటిని వేటాడక, ఎక్కడైనా సింహం కనబడుతుం దేమే అని వెతుక్కుంటూ అరణ్యంలో చాలా దూరం వెళ్ళారు. మిట్టమధ్యాహ్నం వేళకు వాళ్ళ శ్రమ ఫలించింది. వాళ్ళొక కొండవాగు వెంట వెళుతూండగా, వాగు అవతలి ఒడ్డున సింహం ఒకటి నిలబడి ఉండటం శశికాం తుడి కంటబడింది.

శశికాంతుడా సింహాన్ని తన మిత్రులకు చూపుతూ, ''మనం గుర్రాలను ఇక్కడే వదిలి నిశ్శబ్దంగా వాగు దాటి, సింహాన్ని అన్ని వైపుల నుంచీ ఒక్కసారిగా చుట్టుముట్టుదాం. మన బాణాల్లో ఏదో ఒకదానికి అది గురికాక పోదు,'' అన్నాడు.

గుర్రం దిగి వాగు కేసి బయలుదేరిన శశికాంతుణ్ణి, జయంతుడు భుజం పట్టు కుని ఆపి, ''శశికాంతా, తొందరపడకు. ఆ వాగు అవతల వున్న అరణ్యభాగం కదంబ రాజ్యం లోనిది. ఆ రాజుకూ మనకూ మధ్య పచ్చిగడ్డి వేస్తే భగ్గు మంటున్నది కదా! మనం వాళ్ళ రాజ్యసరిహద్దులు దాటటం ప్రమాద కారణం కావచ్చు,'' అన్నాడు.

వేట తమకంలో వున్న శశికాంతుడు తన మిత్రుడి సలహా విని, అవహేళనగా నవ్వి, ''నేనసలే పిరికివాణ్ణి, మరీ అంతగా పిరికి

'చందమామ'



మందు పోయకు! మనం, కదంబరాజ్యాన్ని జయించేందుకు ఆ రాజ్యంలో ప్రవేశించటం లేదు, క్రూర మృగాన్ని వేటాడేందుకు పోతున్నాం. ఆ పని ముగియగానే, తిరిగి మన రాజ్యం ప్రవేశిస్తాం,'' అన్నాడు.

''శశికాంతా, బాగా చెప్పావు. సింహం మన పాల బడితే, మాంసాన్ని రాజుకూ, చర్మాన్ని ఆయన ఏకైక పుత్రిక కాంతిసేనకూ బహుమానంగా పంపుదాం,'' అన్నాడు భద్రుడు ఉత్సాహంతో.

ఈ మాటలకు శశికాంతుడు పెద్దగా నవ్వాడు. సింహం తల తిప్పి, తనకేసి వస్తున్న వేటగాళ్ళను చూస్తూనే, మెల్లగా గర్జించి తోక ఆడిస్తూ ముందుకు రెండడుగులు వేసింది. అదే సమయంలో శశికాంతుడు సింహం కంఠానికి బాణం గురిచేసి వదిలాడు. బాణం దెబ్బ తింటూనే సింహం మహోద్ధృతంగా గర్జిస్తూ వాగు కేసి ఛెంగున దూకింది.

శశికాంతుడూ అతడి మిత్రులూ చప్పున విడిపోయి, మోకాళ్ళ లోతున వున్న వాగును తృటికాలంలో దాటి, సింహం మీద మూడు వైపుల నుంచీ బాణాలు వదిలారు. ఈ సారి బాణాల్లో ఒకటి సింహం డొక్కలో బలంగా నాటుకున్నది. అది గర్జిస్తూ తన మీదికి వస్తున్న ముగ్గురిలోనూ అందుబాటులో వున్న శశికాంతుడి మీదికి కుప్పించి దూకింది. శశికాంతుడు ఇక విల్లంబులతో పని కాదని కత్తి దూశాడు. అంతలో చెట్ల చాటున కలకలం బయల్దేరింది. మరుక్షణం ఒక ఈటె దూసుకుంటూ వచ్చి, సింహం తలను బలంగా తాకింది. శశికాంతుడూ, అతడి మిత్రులూ కలకలం వచ్చిన వైపుకు చూసేంతలో, ''సరిహద్దులు దాటిన శత్రువులను చంపండి!'' అన్న కేకా, ఆ వెంటనే రివ్వురివ్వుమంటూ బాణాలూ వచ్చి వారి మీద పడినై. శశికాంతుడు గాయపడి నేల కొరుగుతూ, ''భద్రా, జయంతా, మీరు త్వరగా పారిపొండి. పొంచివుండి కపటయుద్ధం చేసే శత్రువులతో పోరి లాభం లేదు,'' అంటూ కేకపెట్టాడు.

ఆ సరికే జయంతుడు అయువు పట్టున బాణం దెబ్బ తిని కింద పడిపోయాడు. భద్రుడు పారిపోయేందుకు వెనుదిరిగేంతలో అతడి వీపున ఒక శత్రుబాణం వచ్చి తగిలింది. కాని, అతడా బాధను లెక్కచేయకుండా, అతి వేగంగా పరిగెత్తి, వాగు దాటి చెట్ల కింద వున్న గుర్రాలను చేరుకుని, అతి కష్టం మీద

గుర్రం ఎక్కాడు. గుర్రం వెనుదిరిగి పరిగెత్త సాగింది. దానితో బాటు మిగిలిన రెండు గుర్రాలూ బయలుదేరెనై. వాగు వైపు నుంచి కొందరు శత్రుసైనికులు పరిగెత్తుకుంటూ వచ్చి, భద్రుడి కేసి బాణాలు వదలసాగారు. ''వాణ్ణి ప్రాణాలతో పోనీకండి. ఇక్కడ గాయ పడి ప్రాణాలు విడుస్తున్నవాడు కుంతలదేశ మంత్రి కొడుకులా వున్నాడు,'' అంటూ వాళ్ళకు వెనక నుంచి హెచ్చరికలు వినబడు తున్నవి.

భద్రుడు ఇవేమీ వినేస్థితిలో లేడు. అతను గుర్రం జూలు పట్టుకుని, దాని మెడమీదికి ఒరిగిపోయాడు. తనకు తెలిసిన దారి గనక గుర్రం, అతణ్ణి సూటిగా రాజధానీ నగరం కేసి తీసుకుపోసాగింది.

ఇక్కడ కొండవాగు వద్ద గాయపడిన శశి కాంత జయంతుల చుట్టూ చాలామంది ఆయుధపాణులు చేరారు. సింహం అప్ప టికే ప్రాణాలు విడిచింది. భద్రుణ్ణి చంప జూసిన శత్రుసైనికులు అరణ్యంలో కొంత దూరం గుర్రం వెనకగా పరిగెత్తి, అది కనబడ కుండా పోవటంతో, తిరిగివచ్చారు. వాళ్ళకు శశికాంతుడి గుర్రం మాత్రం దొరికింది.

''మహారాజా! క్షమించండి. ఆ గాయ పడిన శత్రువుతో గుర్రాలు రెండూ మహా రణ్యంలో కనబడకుండా పోయినై. ఎంతో శ్రమపడి దీన్ని పట్టుకోగలిగాం. ఇది పంచ కళ్యాణిలా వున్నది. విలువైన జీనూ అవీ చూస్తుంటే, ఇది కుంతల దేశపు మంత్రి కొడుకుదని మా కనుమానం కలుగుతు



న్నది,'' అన్నారు సైనికులు, గుర్రాన్ని తమ ఏలిక ముందుకు నడిపించుకుపోయి.

కదంబరాజు ఆగ్రహంతో ఆ సైనికులనో క్షణం చూసి, పక్కన చేతులు కట్టుకు నిల బడి వున్న సేనానాయకుడి కేసి తలతిప్పి, ''సేనానీ, గాయపడిన శత్రువును కూడా చేజిక్కించుకోలేని అర్భకులన్న మాట, మన సైనికులు! వీళ్ళ ధైర్యసాహసాలను నమ్ముకు నేనా, మనం కుంతలరాజుతో వైరం పెట్టుకు న్నది?'' అన్నాడు ఈసడింపుగా.

సేనానాయకుడు ఏదో చెప్పబోయి, రాజు ముఖం మీది ఉగ్రత్వం చూసి, ''మహా రాజా!'' అంటూ నీళ్ళు నమలసాగాడు. ఉగ్రసేనుడు శశికాంతుణ్ణి సమీపించి, నిశ్చ లంగా పడివున్న అతణ్ణి ఎడమ కాలితో అటూ ఇటూ కదిలించి చూసి, ''వీడు మంత్రి



కొడుకే, అనుమానం లేదు. ఇంకొంచెం ప్రాణం వున్నట్టు కనబడుతున్నది. వీణ్ణి ఎత్తుకు పోయి, ఆ కొండగుహల్లో ఎక్కడనైనా పారవేసి రండి. సరే, ఆ రెండోవాడి మాటేమిటి?'' అన్నాడు.

ఇద్దరు సైనికులు జయంతుణ్ణి కదిలించి చూసి, ''వీడి ప్రాణం ఎప్పుడో గాల్లో కలిసింది మహారాజా!'' అన్నారు.

''అయితే, వాణ్ణీ ఆ కొండగుహలోనే పార వెయ్యండి,'' అంటూ ఉగ్రసేనుడు సేనాని కేసి తిరిగి, ''సేనానీ! ఇవ్వాళ మనం వేటకు బయలుదేరిన వేళ మంచిది కాదు. నేను బాణం గురిచూసి వదిలేటప్పుడు వీళ్ళు మామూలు కుంతలరాజ్య సైనికులనుకు న్నాను తప్ప, సాక్షాత్తూ ఆ దేశపు మంత్రి కొడుకూ, వాడి స్నేహితులూ అయి ఉంటా రని అనుమానించ లేదు. ఆ రాజు మనకన్న ఎన్నో రెట్లు బలవంతుడు, మంత్రి బుద్ధి చాతుర్యం మనం ఎరిగినదే! మనం నగరానికి వెంటనే తిరిగి వెళ్ళి, మన సరిహద్దు సైనికుల వల్ల పొరపాటు జరిగిపోయిందని కుంతల రాజు నమ్మే విధంగా, ఏదైనా మంచి పథకం ఆలోచించాలి,'' అన్నాడు.

''అవును మహారాజా, అవును. అందుకు మన మహామంత్రులు సర్వసమర్థులు,'' అన్నాడు సేనానాయకుడు.

ఉగ్రసేనుడు మారు మాటాడకుండా గుర్రాన్నెక్కి బయలుదేరాడు. అతడికి వెనకగా సేనాని కదిలాడు. సైనికుల్లో ఒక పదిమంది వెనక నిలబడిపోయి శశికాంతుణ్ణీ, జయం తుణ్ణీ చాపచుట్టల లాగా భుజాల మీద వేసుకుని పరిహాసంగా, ''ఓహోం, ఓహోం బీ,'' అంటూ కొండగుహల కేసి పరిగెత్తారు.

గాయపడిన భద్రుణ్ణి మోసుకుంటూ బయలుదేరిన గుర్రం, నగర ద్వారాలు మూసే వేళకు అక్కడికి చేరింది. మంత్రి కుమారుడి కోసం ఎదురు చూస్తున్న ద్వార రక్షకులు, అతడి మిత్రుడైన భద్రుణ్ణి ఆ స్థితిలో చూసి, గాభరా పడిపోయారు. భద్రుడు బతికి వున్నాడో లేదో కూడా పరీక్షించి చూసేందుకు వాళ్ళు భయపడ్డారు. జయంతుడెక్కి వెళ్ళిన గుర్రం భద్రుడి గుర్రం వెంట వున్నది.

ద్వారరక్షకులు భద్రుడున్న గుర్రం వెంట కాగడాలు తీసుకుని రాజనగరు కేసి బయలు దేరారు. వెన్నులో బాణం గుచ్చుకుని వున్న మనిషిని రాజవీధి వెంట మోసుకుపోయే

గుర్రాన్నీ, దాని వెనకగా కాగడాలు పట్టి నడుస్తున్న భటులనూ చూసి, పౌరులు గుంపులు గుంపులుగా పోగయ్యారు.

గుర్రం తిన్నగా రాజప్రాసాద ఆవరణ ప్రవేశించి, గుర్రపుసాల వద్దకు వెళ్ళి నిలబడింది. ఈ లోపుగా, వార్త తెలియటంతో, రాజు శతభానుడూ, మంత్రి గంగాధరుడూ అక్కడికి వచ్చారు. భద్రుణ్ణి నౌకర్లు జాగ్రత్తగా గుర్రం మీంచి దింపారు. ఆస్థాన వైద్యుడు అతణ్ణి పరీక్షించి చూసి, వీపులో గుచ్చుకుని వున్న బాణాన్ని నేర్పుగా లాగాడు. ఆ సమయంలో భద్రుడిలో కొంచెం చలనం కనిపించింది. వైద్యుడు అతడి నాడి పరీక్షించి, ''మహారాజా! నాశక్తి కొలదీ ప్రయత్నిస్తాను. దైవసహాయం కూడా వుంటే, భద్రుడు జీవించే అవకాశం వున్నది,'' అన్నాడు.

భద్రుణ్ణి ఒక మంచం మీద పడుకోబెట్టి, నౌకర్లు అతణ్ణి భవనంలోకి తీసుకుపోయారు. అంతవరకూ భద్రుడికి తగిలిన బాణాన్ని పరీక్షించి చూస్తున్న మంత్రి, సేవకుణ్ణొకణ్ణి పిలిచి, బాణాన్ని అతని చేతికిస్తూ, ''దీన్ని బాగా కడిగి శుభ్రపరిచి తీసుకురా,'' అని ఆజ్ఞాపించాడు.

''శశికాంతుడూ, జయంతుడూ ఏమైనట్టు? మహామంత్రీ, మన రాజ్యంలోనే మనకు ఇంత ప్రబలులైన శత్రువులున్నారని, నేనెన్నడూ అనుమానించలేదు,'' అన్నాడు రాజు శతభానుడు.

''మహారాజా! ఈ దురాగతం మనరాజ్యంలో జరిగింది కాదని నాకు తోస్తున్నది. భద్రుడు



బతికి బయట పడితే, అరణ్యంలో జరిగిందేమిటో మనకు పూర్తిగా తెలిసి పోతుంది. శశికాంతుడూ, జయంతుడూ తిరిగి వస్తారన్న నమ్మకం నాక్కలగటం లేదు. భద్రుణ్ణి గాయపరిచిన బాణం మీద ముద్రితమైన చిహ్నాలు చూస్తూంటే...'' అంటూ మంత్రి గంగాధరుడు ఉత్తరీయంతో కళ్ళు తుడుచుకున్నాడు. శతభానుడి మనస్సు కలవరపడింది. మంత్రికి శశికాంతుడు ఏకైక పుత్రుడు. ఓదార్పు మాటలు ఎన్ని చెప్పి మాత్రం ప్రయోజన మేమిటి?

మంత్రి ఇచ్చిన బాణాన్ని రక్తం లేకుండా శుభ్రంగా కడిగి, గుడ్డతో తుడిచి, సేవకుడు దాన్ని తెచ్చి ఆయనకిచ్చాడు. గంగాధరుడు బాణాన్ని ఒక కాగడా వెలుగులో బాగా పరీక్షించి చూసి, నివ్వెరపోతూ, దాన్ని శతభానుడి

కిచ్చి, ''మహారాజా! ఆ బాణం విడిచినవాడు కదంబరాజు ఉగ్రసేనుడు. దాని అలుగు మీద అతడి రాజచిహ్నమైన ఎలుగుబంటి తల వున్నది,'' అన్నాడు.

శతభానుడు బాణాన్ని పరీక్షించి చూసి, ''మహామంత్రీ! దీని అర్థం ఏమిటి? ఉగ్రసేనుడు యుద్ధప్రకటన లేకుండానే మన మీదికి దండెత్తి వస్తున్నాడా? మన వేగులవాళ్ళు ఏం చేస్తున్నారు?'' అన్నాడు కోపంగా.

''మహారాజా, ఉగ్రసేనుడికి మన మీద బహిరంగంగా దండయాత్ర చేసే శక్తి సామర్థ్యాలు లేవు. అయినా మన జాగ్రత్తలో మనం ఉండటం మంచిది. సేనానికి చెప్పి, సైనిక సమీకరణా, రక్షణ ఏర్పాట్లూ చేయించండి,'' అన్నాడు గంగాధరుడు.

శతభానుడు సేవకుణ్ణొకణ్ణి పిలిచి, సేనానాయకుణ్ణి పిలుచుకు రమ్మని ఆజ్ఞాపించి, భవనం కేసి బయలుదేరేంతలో, సైనికుడొకడు రొప్పుతూ రోస్తూ రాజు దగ్గిరికి వచ్చి, ''మహారాజా! కదంబరాజు పంపగా వచ్చిన దూతలు నగరద్వారాల వద్ద వున్నారు. వాళ్ళను మీ దగ్గిరకు తెమ్మని సెలవా?'' అని అడిగాడు.

''ఉగ్రసేనుడు మన వద్దకు దూతలను పంపటమా?'' అంటూ శతభానుడు ఆశ్చర్యపోయాడు.

''దూత లెంతమంది? దర్పంగా కనిపిస్తున్నారా?'' అని ప్రశ్నించాడు గంగాధరుడు.

''అలాంటిదేమీ లేదు, ప్రభూ. వచ్చిన వాళ్ళంతా కలిసి ఆరుగురు. వాళ్ళల్లో ఇద్దరు పెడరెక్కలు విరిచి కట్టబడి వున్నారు. అందరూ ప్రాణాలరచేత పెట్టుకుని వున్న వాళ్ళలా బెదురు చూపులతో కనిపిస్తున్నారు,'' అన్నాడు సైనికుడు.

''దీని వెనక ఏదైనా కుటిల రాజనీతి లేదు గదా, మహామంత్రీ? అరణ్యంలో ఏదో ఘోరం జరిగిపోయినట్టు నా కనుమానం కలుగుతున్నది,'' అన్నాడు శతభానుడు తల పంకిస్తూ.

''ఉగ్రసేనుడు అందులో అన్ని విధాలా సమర్థుడే. ఏది ఏమైనా, ఈ దూతల ద్వారా అతడు పంపిన రాయబార మేమిటో తెలుసుకోవటం అవసరం గదా?'' అంటూ గంగాధరుడు కొంచెం ఆగి సైనికుడికేసి తిరిగి, ''వాళ్ళను సభామందిరానికి తీసుకురా,'' అని ఆజ్ఞాపించాడు. -(ఇంకావుంది)





# మంచి శత్రువు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, మేలు చేసిన వారిపట్ల కృతజ్ఞత చూపడం, మైత్రి పాటించడం మానవనైజం. అది మరువరాని కనీస మానవ ధర్మం అన్నది పెద్దల అభిప్రాయం. అయితే, తన కుమారుడికి ఎవరూ చేయనంతగా మేలు చేసిన ఉపకారి పట్ల శత్రుత్వం వహించమని తండ్రికి సలహా ఇచ్చిన జ్ఞానేంద్రుడనే ఒక వింత గురువు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

విజయపురిలోని సంపాదుడికి కూర్చుని తిన్నా తరతరాలకు



తరగని ఆస్తి ఉన్నది. మంచి మనసుతో పరోప కారం చేసే ఆయనకు చాలాకాలం సంతానం కలగలేదు. పిల్లల కోసం దేవుణ్ణి పూజించమని కొందరు మిత్రులాయనకు సలహా ఇచ్చారు. కాని, మానవసేవే మాధవ సేవ అని నమ్మిన ఆయన దేవుడికి ప్రత్యేక పూజలు చేయడానికి ఒప్పుకోలేదు. చివరికి ఆయన నమ్మకమే నిజమై కొంతకాలానికి ఆయనకు మగబిడ్డ కలిగితే వాడికి నింపాదుడని పేరు పెట్టి అల్లారుముద్దుగా పెంచసాగాడు.

నింపాదుడు చిన్నప్పటి నుంచీ మందకొడిగా ఉండేవాడు. పెద్ద వాడవుతున్న కొద్దీ వాడి తీరు కూడా విచిత్రంగా ఉండేది. ఎవరేం చెప్పినా అందరికీ ఒకలా అర్థమయితే, వాడికి మరోలా అర్థమయ్యేది. భాగ్యవంతుల బిడ్డ అని ఎదురుగా ఏమీ అనకపోయినా చాలా మంది చాటుగా వాడి గురించి చెప్పుకుని నవ్వుకునేవారు. చదువుకుంటే బుద్ధి వికసిస్తుందన్న ఆశతో సంపాదుడు వాణ్ణి, ఊళ్ళో పేరున్న గురువు దగ్గరికి పంపాడు. కాని ప్రయోజనం కనిపించలేదు. వైద్యులను సంప్రదించాడు. వాడి లోపానికి కారణమేమిటో వాళ్ళు కనుగొనలేకపోయారు. ఆఖరికి జ్యోతిషం మీద నమ్మకం లేకపోయినా, సంపాదుడు మరోగత్యంతరం కనిపించక, ఊళ్ళో పేరు మోసిన జ్యోతిష్కుణ్ణి కలుసుకుని కొడుకు విషయం చెప్పాడు.

జ్యోతిష్కుడు నింపాదుడి జాతక చక్రం వేసి, ‘‘అంతా గ్రహగతుల ప్రభావం. అది మారాలంటే నీ బిడ్డకు స్థలం మార్పు అవసరం,’’ అంటూ లెక్కలు వేసి, ‘‘విద్యావనం నింపాదుడికి అనుకూలమని తోస్తోంది. అక్కడ జ్ఞానేంద్రుడనే మహాపండితుడు గురుకులం నడుపుతున్నాడు. నువ్వు నీ కొడుకు నాయనకు అప్పగించి, మార్పొచ్చేవరకు అక్కడే వుంచు,’’ అని సలహా ఇచ్చాడు.

సంపాదుడు సరేనని కొడుకును తీసుకుని జ్ఞానేంద్రుడి వద్దకు వెళ్ళి విషయం చెప్పాడు.

జ్ఞానేంద్రుడు నింపాదుణ్ణి కొన్ని ప్రశ్నలడిగి పరీక్షించాక, ‘‘ఇతడి ఆలోచనలు అందరికీ భిన్నంగా, విచిత్రంగా ఉన్నాయి. ఇతడిలో మార్పు తీసుకురావడం చాలా కష్టం. జ్యోతిష్కుడు చెప్పినట్టు స్థల మహాత్మ్యమే పనిచేయాలి. మార్పురావడానికి ఎంత కాలం పడుతుందో తెలియదు. మధ్య మధ్య వచ్చి పరిస్థితి తెలుసుకుని వెళుతూండు,’’ అన్నాడు.

సంపాదుడు సరేనని కొడుకును గురుకులంలో చేర్చి వెళ్ళిపోయాడు.

ఏళ్ళుగడుస్తున్నాయి. నింపాదుడి ఆలోచనల్లో ఏమార్పూరాలేదు. ప్రతి విషయానికీ వాడు చెప్పే విపరీతార్థాలు విని మిగతా శిష్యులు నవ్వుతూ, తరచూ ఆటపట్టించేవారు.

ఇలా ఉండగా సురపురం నుంచి సుధీరుడనే ఒక రైతు కొడుకు గురుకులంలో చేరి, కొద్ది రోజుల్లోనే శిష్యులందరిలోకీ ప్రథముడయ్యాడు. అప్పటికీ శిష్యులందరిలోకీ అధమస్థాయిలో వున్న నింపాదుడు సుధీరుడి స్నేహం కోరాడు. కానీ మిగతా శిష్యుల ప్రభావంతో సుధీరుడు కూడా వాణ్ణి ఆటపట్టించడంతో నిరాశ చెందాడు.



యేడాది గడిచేసరికి తండ్రి పీకల్లోతు అప్పుల్లో మునిగి ఉన్నట్టు సుధీరుడికి తెలియరావడంతో, అతడు చదువు మాని తండ్రి వద్దకు వెళ్ళిపోదామనుకున్నాడు. ఆ సమయంలో కొడుకును చూడ్డానికి వచ్చిన సంపాదుడు, సుధీరుడి వివరాలు అడిగి తెలుసుకుని, ''తెలివైన వాళ్ళు చదువు మానకూడదు. నీ ఖర్చు నేను భరిస్తాను. సురపురంలో మీ తండ్రి సమస్య ఏమిటో తెలుసుకుని నేను పరిష్కరిస్తాను,'' అని ధైర్యం చెప్పి వెళ్ళాడు.

తనేమో ఉత్తపుణ్యాన నింపాదుణ్ణి ఆటపట్టిస్తే, అతడి తండ్రి నిస్వార్థంగా తనకు సాయపడతాననడం సుధీరుడికి చెంపపెట్టులా తోచింది. అతడు సిగ్గు పడ్డాడు. నింపాదుడి స్నేహం కోరాడు. పూర్వానుభవం వల్ల వాడతణ్ణి నమ్మక, ''మళ్ళీ ఆటపట్టిచ్చేందుకా?'' అన్నాడు అనుమానంగా.

సుధీరుడు నవ్వి, ''నువ్వు మంచి తెలివైనవాడివని నీ స్నేహం కోరుతున్నాను. గురువు చెప్పినదాంట్లో ఎవరికీ తోచని అర్థాలు నీకు స్ఫురిస్తున్నాయి. వాటిని అధ్యయనం చేసి నా తెలివి పెంచుకుంటాను,'' అన్నాడు.

అలాంటి పొగడ్త విని విస్మయం చెందిన నింపాదుడి సంతోషానికి హద్దుల్లేవు. వాడు సుధీరుడితో స్నేహంకట్టి గురువు పాఠాలు తనకెలా అర్థమవుతున్నదీ చెబితే–సుధీరుడు మెచ్చుకున్నాడు. కొన్నాళ్ళయ్యాక సుధీరుడు నింపాదుడితో, ''గురువు పాఠాలు నీకెలా అర్థమయిందో మేము తెలుసుకున్నాం. మాకెలా అర్థమయిందో నువ్వు తెలుసుకో,'' అన్నాడు.



నింపాదుడికిది సబబే అనిపించి సుధీరుడి వివరణలను కుతూహలంగా వినసాగాడు. క్రమంగా అతడికీ గురువు చెప్పేవి అందరికిలాగే అర్థం కాసాగాయి.

వాడిలో వచ్చిన మంచి మార్పును చూసిన జ్ఞానేంద్రుడు జరిగింది తెలుసుకుని సుధీరుణ్ణి పిలిచి, ''నువ్వనే దాకా నింపాదుడి అవగాహనలో అర్థమున్నట్టు నాకు తోచలేదు. నీ ద్వారా వాడి అవగాహన పెరగడం నాకు ఆశ్చర్యంగా ఉంది. ఇదెలా సాధ్యమయింది?'' అని అడిగాడు ఆశ్చర్యంగా.

''తెలివి తక్కువ వాళ్ళను హేళన చేయడానికి తెలివి అక్కరలేదు. సమర్థించడానికే తెలివి కావాలి. సమర్థిస్తే తెలివి తక్కువవారికి ఉత్సాహం పెరిగి ఆత్మవిశ్వాసంతో బుద్ధి వికసిస్తుంది. నింపాదుడి విషయంలో నేను చేసినదదే,'' అన్నాడు సుధీరుడు. జ్ఞానేంద్రుడతణ్ణి మెచ్చుకుని, ''ఏళ్ళ తరబడి విద్యాబోధన చేస్తున్న నాకు స్ఫురించని ఉపాయం నీకు తోచడానికి కారణం నీ మంచితనం. ఇది తెలిస్తే ఇప్పటికే సాయంచేస్తూన్న సంపాదుడు నీకింకా పెద్ద ఉపకారం చేస్తాడు,'' అన్నాడు.

అందుకు సుధీరుడు వినయంగా, ''సంపాదుడు నిస్వార్థంగా చేసే సాయాన్నే నేను స్వీకరించ గలను. నింపాదుడిలోని మార్పుకు కారణం నేనని ఆయనకు చెప్పకండి,'' అన్నాడు. జ్ఞానేంద్రుడు సరేనన్నాడు.

ఈలోగా సంపాదుడు సురపురం వెళ్ళి సుధీరుడి తండ్రి అప్పులన్నీ తీర్చాడు. అతడి కష్టాలన్నిటికీ దాయాదుల దుష్టబుద్ధే అని గ్రహించాడు. విద్యావనం వచ్చినప్పుడల్లా తండ్రి క్షేమంతో పాటు దాయాదుల దుష్టబుద్ధి గురించి కూడా సుధీరుడికి చెబుతూండేవాడు. దాంతో సుధీరుడికి దాయాదులంటే చెప్పలేనంత కసి ఏర్పడింది.

మరో ఐదేళ్ళలో సుధీరుడు విద్యాభ్యాసం పూర్తిచేశాడు. గురువతడికి వీడ్కోలు చెబుతూ, ''నువ్వు మంచివాడివి. నీ తెలివికి ఆ మంచితనం జతపడితే, చాలా గొప్పవాడివవుతావు. కాబట్టి ఎట్టి పరిస్థితుల్లోనూ మంచితనం విడిచి పెట్టవద్దు,'' అన్నాడు. సుధీరుడాయనకు నమస్కరించి, ''గురువర్యా! నేను మా తండ్రికి తోడుగా ఉన్నానని, నయవంచనతో నన్ను గురుకులానికిపంపి, మా దాయాదులు దుష్టులై నా తండ్రిని నిష్కారణంగా నానా కష్టాలపాలు చేశారు. అలాంటి వారిపై పగ

తీర్చుకున్నాకే మంచితనం గురించి ఆలోచిస్తాను,'' అన్నాడు వినయంగా.

''ఎంతటి దుష్టుడికైనా ఏదో మంచి గుణముంటుంది. ఆ మంచిని మెచ్చి, చెడును క్షమించడం నేర్చుకోవాలి. నీవంటి మంచి వాడికి పగ, ద్వేషం అచ్చిరావు. మంచితనం విడువకు,'' అని జ్ఞానేంద్రుడు ఎంత చెప్పినా కసి కారణంగా సుధీరుడి తలకెక్కలేదు.

ఆ సమయానికి సంపాదుడక్కడే ఉన్నాడు. సుధీరుడి తండ్రి దాయాదుల దుర్మార్గం గురించి తెలిసిన ఆయన సుధీరుణ్ణి సమర్థించాడు. తాను తోడుగా ఉండి పగతీర్చుకోవడంలో సాయపడతానన్నాడు.

అందుకు జ్ఞానేంద్రుడు నవ్వి, ''పరోపకారివైన నువ్వు ఎవరికైనా సాయపడాలనుకోవడం సహజమే. అయితే, సుధీరుడికి సాయపడడం నీ బాధ్యత కూడా. ఎందుకంటే నీ కుమారుడు నింపాదుడు బాగుపడడానికి స్థలం మహిమకంటే సుధీరుడే ఎక్కువ కారణం,'' అన్నాడు.

''అవును ఆ సంగతి మా నింపాదుడు నాకెప్పుడో చెప్పాడు. సుధీరుడికి సాయపడడం నా బాధ్యత,'' అన్నాడు సంపాదుడు.

జ్ఞానేంద్రుడు నవ్వి, ''అలాంటప్పుడు నువ్వు సుధీరుడికెలా సాయపడాలో పరిపూర్ణ విద్యావంతుడైన నీ కుమారుడు నింపాదుడే నిర్ణయిస్తాడు. సరేనా?'' అన్నాడు.

సంపాదుడు అందుకు అంగీకరించగానే, గురువు నింపాదుణ్ణి పిలిచి విషయం చెప్పాడు. నింపాదుడు కొంతసేపు ఆలోచించి



తండ్రితో, ''బాధ్యతగా సుధీరుడికి సాయపడాలంటే అతడి శత్రువులపై పగ సాధించడం కాదు; నువ్వు కూడా అతడికి శత్రువు కావాలి. అదే నువ్వు చేసే ప్రత్యుపకారం,'' అని సుధీరుడికేసి తిరిగి, ''నాకెంతో మేలు చేసిన నీకొక సలహా! మీ తండ్రిని కష్టాల పాలుచేసిన దాయాదుల మీద పగసాధించే ముందు, ఇన్నాళ్ళు సాయపడి ఇప్పుడు శత్రువుగా మారిన నా తండ్రి మీద పగసాధించడానికి ప్రయత్నించు. ఆ తరవాత నీ దాయాదుల వ్యవహారం చూడవచ్చు,'' అన్నాడు.

సంపాదుడు, సుధీరుడు దిగ్భ్రాంతితో గురువు కేసి చూశారు. గురువు నింపాదుడి మాటకు మందహాసంతో తలపంకించాడు.

బేతాళుడు ఇంతవరకు చెప్పి, ''రాజా, ఉపకారం చేసిన వాడితో శత్రుత్వం వహించ

డమే ప్రత్యుపకారం అని నింపాదుడు చెప్పడం చూస్తూంటే, విద్యాభ్యాసంతో అతడి ఉన్న మతి కాస్త మందగించిందన్న అనుమానం కలుగుతుంది కదా? మరి విజ్ఞుడైన గురువు దానిని ఆమోదించడంలో గల ఆంతర్యం ఏమిటి? మేలు చేసిన వారి పట్ల శత్రుత్వం వహించడం ఎలా ధర్మమనిపించుకుంటుంది? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''సుధీరుడు మంచివాడు; మేధావంతుడు. అతడి ప్రోత్సాహం కారణంగానే నింపాదుడిలో అనూహ్యమైన మార్పు వచ్చింది. మంచితనానికి తెలివి తోడైతే అసాధ్యాలను సుసాధ్యం చేయవచ్చని గురువుకే సోదాహరణగా నిరూపించిన అసామాన్యుడు సుధీరుడు. అటువంటివాడు పగ, ద్వేషాలకులోనై వివేకం కోల్పోతే అది సమాజానికే నష్టం. దాయాదుల్లో అసలు మంచి గుణం లేదని నమ్మడమే అతడి ఆగ్రహానికి కారణం. సంపాదుడు సాయం చేసి ఊరుకోకుండా దాయాదుల దుర్మార్గం గురించి సుధీరుడికి తెలియజేసి అతనిలో ప్రతీకార వాంఛ కలిగేలా చేశాడు. శత్రువుల్లో సైతం మంచితనం ఉంటుందని అతడు గ్రహించాలంటే మొదట అతడికో మంచి శత్రువు కావాలి. సంపాదుడి మంచితనం మీద అతడికి అపార నమ్మకం ఉన్నది. అందువల్ల అతడు శత్రువుగా మారినా సుధీరుడు అతడిలోని మంచితనాన్ని గుర్తించి, అతడి మైత్రి కోసం ప్రయత్నించగలడు. ఆ అనుభవంతో దాయాదుల్లో సైతం మంచిని గుర్తించి, చెడును ఉపేక్షించేస్వభావం అలవడుతుంది. ప్రతీకార వాంఛ తగ్గుతుంది. విద్యావంతుడైన నింపాదుడు ఈ విషయం గుర్తించి చెప్పడంవల్లే గురువు దానిని ఆమోదించాడు. సంపాదుడు వహించే శత్రుత్వమే సుధీరుడికిమేలు చేస్తుంది గనక అది ధర్మమే అవుతుంది,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం : ''వసుంధర'' రచన]



# చందమామ కబుర్లు

## మాట్లాడే రోబో!




జపానుకు చెందిన సుప్రసిద్ధ ఇంజినీరింగ్ కంపెనీ హితాచీ ఇటీవల EMIEW2 అనే మనిషిరూపం రోబోను తయారు చేసింది. ఇది నడుస్తుంది, వంగుతుంది, చక్రాల మీద కదులుతుంది, మాట్లాడుతుంది! రెండు కాళ్ళతో 80 సెం.మీ. ఎత్తున్న ఈ రోబో బరువు 13 కి.గ్రా. మాత్రమే. మనుషుల మధ్య ఉంటూ రకరకాల పనులు చేయగలిగే రోబోలను తయారు చేయడంలో ఇది మరో ముందడుగుగా చెబుతున్నారు. EMIEW2 ఆఫీసులో విజిటర్లను క్యాబిన్ల వద్దకు తీసుకువెళుతుంది. ఫైళ్ళను తీసుకువస్తుంది. పానీయాలను అందిస్తుంది. ఆఫీసు పనిగంటల తరవాత సెక్యూరిటీ పనులు కూడా చూస్తుంది. ఒక రోబో ఇంకా ఏం చెయ్యాలి చెప్పండి మరి!

## శ్వాసకోశ బలం!

కేరళ రాష్ట్రం కొచ్చికి చెందిన షెల్పీ జోస్ ఇరవై నిమిషాల్లో 20 మోటార్ సైకిళ్ళను 678 సార్లు తన వక్షస్థలం మీదుగా వెళ్ళేలా చేశాడు. అతడు ప్రపంచ రికార్డు కోసం ప్రయత్నిస్తున్నాడు. ముప్పై ఎనిమిదేళ్ళ ఈ డాన్ బ్లాక్ కరాటే ఛాంపియన్ ఎర్నాకుళంలోని మెరీన్ డ్రైవ్ ఇన్‌లో జనం ఎదుట తన శరీరబలాన్ని ప్రదర్శించాడు. అతడొక మెత్తటి చాప మీద వెల్లకిలా పడుకుని వక్షస్థలం మీద పలకను వేయమన్నాడు. అతడు సంకేతం ఇవ్వగానే మోటారు సైకిళ్ళు ఒక్కొక్కటిగా పలక మీదుగా దూసుకువెళ్ళాయి. 501 సార్లు వెళ్ళగానే అతడు లేవాలని మొదట అనుకున్నారు. కాని అతడు మళ్ళీ రమ్మని సైగ చేయడంతో ఇరవై మంది రైడర్‌లు అతని మీదుగా 678 సార్లు వాహనాలు నడిపించారు. ఆ తరవాత అతడు చిరునవ్వుతో లేచి హర్షధ్వానాలు చేస్తున్న జనం కేసి చేతులు ఊపాడు. ఆ జనంలో అతడి భార్యాపిల్లలు కూడా ఉన్నారు. గిన్నిస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్ ప్రతినిధుల సమక్షంలో ఈ ప్రదర్శన జరిగింది. 100 జీపుల సవారీ తన మీద వెళ్ళేలా మునుముందు ప్రయత్నిస్తానని అతడు చెప్పాడు.





# ఏకలవ్యుడు

అచంచలమైన పట్టుదలకూ, అనుపమ స్వయంకృషికీ, అకళంకమైన గురుభక్తికీ పేరుగాంచిన వీరకుమారుడు ఏకలవ్యుడు. హస్తినాపుర సమీపంలోని అడవులలో నివసించే హిరణ్యధన్వుడనే ఎరుకలరాజు కొడుకు అతడు. చిన్నారి చిరుతప్రాయం నుంచేవేటాడ్డం పట్ల ఆసక్తిగల అతడికి ధనుర్విద్యను గురుముఖంగా అభ్యసించాలనే కోరిక కలిగింది.

ఆ కాలఘట్టంలోనే ద్రోణాచార్యుడు హస్తినాపురంలోని కురుపాండవ రాకుమారులకు విద్యనేర్పుతూ ఉండేవాడు.

ఆ సంగతి ఏకలవ్యుడికి తెలియడంతో అతడు అమితోత్సాహంతో హస్తినాపురానికి వెళ్ళి, ద్రోణాచార్యుణ్ణి దర్శించాడు. తన వివరాలు తెలియచెప్పి తనను ఒక శిష్యుడిగా చేర్చుకోమని ప్రార్థించాడు. అయితే, అతడు ఎరుకలవాడని తెలిసి-క్షత్రియులకు మాత్రమే తాను విద్యను నేర్పగలనని చెప్పి, ద్రోణుడు అతణ్ణి శిష్యుడిగా స్వీకరించడానికి నిరాకరించాడు.

ఏకలవ్యుడి లేతమనసు ముల్లు గుచ్చుకున్నట్టు బాధతో విలవిలలాడింది. తీవ్రమైన నిర్వేదానికి లోనయ్యాడు. అయినా కొంత సేపటికి తేరుకుని, ద్రోణుడికి వినయంగా నమస్కరించి అక్కడి నుంచి బయలుదేరాడు. అయినా, అతనిలోని ఆశ అంతరించి పోలేదు. పట్టుదల సడలలేదు. అడవిని చేరగానే మట్టితో ద్రోణాచార్యుడి బొమ్మను చేసి ప్రతిష్ఠించాడు. ఆయనే గురువుగా భావించి అహర్నిశలు బాణాలు ప్రయోగించడం దీక్షతో అభ్యాసం చేయసాగాడు. నిరంతర అభ్యాసం ఫలితంగా రోజు రోజుకూ అనుభవంతో కొత్తకొత్త మెళకువలు నేర్చుకుంటూ నైపుణ్యాన్ని పెంపొందించుకోసాగాడు.

పురాణ వీరకుమారులు - 3



ఇలా ఉండగా ఒకనాడు ద్రోణుడి వద్ద విద్యనభ్యసిస్తున్న రాకుమారులు వేటాడడానికి అడవికి వచ్చి ఏకలవ్యుడున్న ప్రాంతాన్ని సమీపించారు. వారి వెంట వచ్చిన వేటకుక్క ఒకటి మిగిలిన కుక్కల నుంచి వేరుపడి దూరంగా వెళ్ళింది. జింకతోలు కట్టుకుని, జుట్టంతా జడలు కట్టుకుపోయి బాణప్రయోగం చేస్తున్న ఏకలవ్యుడు కనిపించడంతో గట్టిగా మొరిగింది. ఏకలవ్యుడు దానికేసి తిరిగి చూడకుండానే, అది చేసిన ధ్వనిని బట్టి దాని మీదికి ఒక్కసారిగా ఏడు బాణాలు వదిలాడు. ఆ ఏడు బాణాలూ కుక్క ముఖంలో గుచ్చుకోవడంతో అది మరింత గట్టిగా మొరుగుతూ వెనుదిరిగి రాకుమారులవద్దకు పరుగుతీసింది. కుక్కముఖంలో నాటిన బాణాలు చూసి, వాటిని వేసినవాడు గొప్ప విలుకాడై ఉండాలని గ్రహించి రాకుమారులు అతణ్ణి వెతుక్కుంటూ అడవి లోపలికి వెళ్ళారు. చెట్టుకింద ఒక యువకుడు విలువిద్యను అభ్యాసం చేస్తూ కనిపించడంతో, ''ఎవరు నువ్వు? నీ తండ్రి ఎవరు? నీ గురువు ఎవరు?'' అని అడిగారు.

''నేనొక ఎరుకలరాజు కొడుకును. నా పేరు ఏకలవ్యుడు. ద్రోణాచార్యులను గురువుగా భావించి విలువిద్యనభ్యసిస్తున్నాను,'' అంటూ అత డు ద్రోణాచార్యుల మట్టిబొమ్మను చూపాడు.

రాజకుమారులు హస్తినాపురానికి తిరిగి వచ్చి, ద్రోణుడికి ఏకలవ్యుడి గురించి చెప్పారు. ద్రోణుడు ఆశ్చర్యపోయాడు. ముఖ్యంగా అర్జునుడికి ఏకలవ్యుడు తనకన్నా విలువిద్యలో గొప్పవాడై ఉంటాడన్న బెంగపట్టుకున్నది. అతనికి ఆహారం రుచించలేదు. కంటి మీద రెప్ప వేయలేకపోయాడు. ''నాకన్నా గొప్ప విలుకాడు లోకంలో మరొకడు ఉండడానికి వీలుకాకుండా నాకు విలువిద్య నేర్పుతానని మాట ఇచ్చారు. మరి ఏకలవ్యుడి మాటేమిటి? అతడు విలువిద్యలో నన్ను మించిన ప్రావీణ్యం కలవాడిలా ఉన్నాడే!'' అని గురువును ఏకాంతంలో నిలదీశాడు.

''ఇచ్చిన మాట తప్పక నిలబెట్టుకుంటాను. నీలో భయం పుట్టించేటంతటి విలువిద్యాకోవిదుడైన ఏకలవ్యుణ్ణి గురించి మీరు చెప్పేదాకా నాకు తెలియదు,'' అని ఓదార్చి ద్రోణుడు, అర్జునుణ్ణి మాత్రం వెంటబెట్టుకుని ఏకలవ్యుడున్న చోటికి వెళ్ళాడు.

విలువిద్యాభ్యాసంలో నిమగ్నుడైవున్న ఏకలవ్యుడు ద్రోణాచార్యుణ్ణి చూడగానే, ఎదురువచ్చి భక్తిశ్రద్ధలతో నమస్కరించి, తీసుకువెళ్ళి కూర్చోబెట్టి అతిథి మర్యాదలు చేశాడు. ఆ తరవాత చేతులు జోడించి, ''తమ శిష్యుణ్ణయిన నన్ను వెతుక్కుని ఇంతదూరం వచ్చారు. ఒక్క మాట చెప్పి పంపితే తమ వద్దకు నేనే వచ్చేవాణ్ణి కదా?'' అన్నాడు.

''నిజంగా నువ్వు నా శిష్యుడివా?'' అని అడిగాడు ద్రోణుడు.

''అవును. అందులో సందేహం లేదు. చూడండి మీ బొమ్మను. మిమ్మల్నే గురువుగా భావించి విలువిద్యను అభ్యసిస్తున్నాను. ముమ్మాటికీ తమ శిష్యుణ్ణే,'' అన్నాడు ఏకలవ్యుడు వినయంగా.

''నువ్వు నా శిష్యుడివయితే మరి నా కివ్వవలసిన గురుదక్షిణ ఎక్కడ?'' అని అడిగాడు ద్రోణుడు.

''ఏం కావాలో సెలవివ్వండి. ఈక్షణమే ఇస్తాను,'' అన్నాడు ఏకలవ్యుడు.

''నువ్వేం ఇవ్వగలవు?'' అని అడిగాడు ద్రోణుడు.

''గురుదక్షిణగా ఇవ్వరానిదేమున్నది గురువర్యా? నా తనువూ, ప్రాణం సర్వం మీదే. ఏమి ఇవ్వమన్నా ఇస్తాను,'' అన్నాడు ఏకలవ్యుడు.

''ఆ తరవాత మాట తప్పవు కదా?'' అని అడిగాడు ద్రోణుడు.

''ఇచ్చిన మాట తప్పడం ఆత్మహత్యతో సమానం. అది మా కులంలో లేదు. నిస్సంశయంగా అడగండి,'' అన్నాడు ఏకలవ్యుడు.

''అలా అయితే, నీ కుడి బొటన వేలును కోసి నాకు గురుదక్షిణగా ఇవ్వు,'' అన్నాడు ద్రోణుడు.

''చిత్తం, గురుదేవా,'' అంటూ ఏకలవ్యుడు ఏమాత్రం వెనుకాడకుండా ఆ క్షణమే తన కుడి బొటనవేలును తెగ నరికి ద్రోణుడికిచ్చాడు. ''చాలా సంతోషం! సుఖీభవ!'' అని దీవించి ద్రోణుడు అక్కడి నుంచి బయలుదేరి, అర్జునుణ్ణి కలుసుకుని సంగతి చెప్పి అతడి దిగులును పోగొట్టాడు!

ఈనాటికీ ఏ రంగంలోనైనా స్వయంకృషితో అసాధారణమైన ప్రతిభను కనబరచే వారిని ఏకలవ్యుడితో పోల్చడం ఆనవాయితీగా కొనసాగుతున్నది!



## నాకు నచ్చిన కథ-14



1983లో ఇదే శీర్షికన కె.ఎ. అబ్బాస్ గారి 'త్రీ గ్రేవ్స్ ఇన్ ఎ స్కూల్' ఇంగ్లీషు చందమామలో ప్రచురించబడింది. దాదాపు పాతికేళ్ళ తరవాత దానిని ఇతర భాషలలో పునర్ముద్రించడం ద్వారా సుప్రసిద్ధ రచయిత, ప్రముఖ చలనచిత్ర నిర్మాత అయిన ఆయనకు నివాళులర్పిస్తున్నాం. ఖ్వాజా అహ్మద్ అబ్బాస్ అన్నది ఆయన పూర్తి పేరు. 1914వ సం.లో పానిపట్టులో జన్మించారు. అలిఘర్ ముస్లిం విశ్వవిద్యాలయం నుంచి న్యాయశాస్త్ర పట్టభద్రుడయ్యాక పాత్రికేయ వృత్తిని చేపట్టారు. ఇంగ్లీష్, హిందీ, ఉర్దూ భాషలలో ఆయన డెబ్భైకి పైగా గ్రంథాలు రచించారు. అవి పలు దేశ, విదేశ భాషలలోకి అనువదించబడ్డాయి.

# బడిలోని మూడు సమాధులు

నా జన్మస్థలం గురించి మీరు తప్పక వినే ఉంటారు. అక్కడ జరిగిన మూడు పానిపట్టు యుద్ధాలు మన దేశ చరిత్రలో అంతర్భాగాలు గనక, పాతిక వేల జనాభాగల ఆ పట్టణం గురించి చరిత్ర పుస్తకాలన్నీ ప్రస్తావిస్తాయి.

నా చిన్ననాటి జ్ఞాపకాలన్నప్పుడు విరామ సమయంలో మేము ఆడుకున్న మూడు చలవరాతి సమాధులేమొదట నా మనసులో కదలాడుతాయి.

ఘియాజుద్దీన్ బాల్బన్ పాలనా కాలంలో ఆఫ్ఘన్-సోవియట్ సరిహద్దుల్లోని హీరాత్ నుంచి పానిపట్టుకు వచ్చి స్థిరపడిన మా తొలి పూర్వీకుడు ఖ్వాజా మాలిక్ అలీ. అరబిక్, పర్షియన్ భాషలలో ఆయన గొప్ప పండితుడు. రాజు ఆయనకు వెంటనే కొంత భూమిని ఈనాముగా ఇచ్చి పానిపట్టు ఖాజీగా నియమించాడు. ఆ కాలంలో ఆయన స్థానికమేజిస్ట్రేటుగా ముఖ్యమైన పలు బాధ్యతలు నిర్వహిస్తూ ఉండేవాడు.

పానిపట్టు నూతన ఖాజీగా పరిష్కరించమని ఆయనకు అప్పగించ బడిన వ్యాజ్యాలలో ముఖ్యమైనది బూ అలీ షా కలేందర్ అనే సూఫీ సన్యాసికి వ్యతిరేకమైన పుకారు.

పానిపట్టులోని కొందరు ఉన్మాదులు దేవుణ్ణి కించపరిచే మాటలు, చర్యలకు పాల్పడుతున్నాడని కలేందర్ మీద ఆరోపణలు చేశారు. తన 'ప్రియుడిగా' భావించిన దేవుడి పట్ల ఆయన అమర్యాదకరమైన పదజాలాన్ని ఉపయోగించాడన్నది ముఖ్యమైన అభియోగం. అయితే, దేవుణ్ణి 'ప్రియుడి'గా భావించి రకరకాల ప్రియమైన మాటలను గుప్పించే సూఫీ సంప్రదాయంలో అది సర్వ సాధారణ



విషయం. అందుకే సూఫీ సాధువు మరణిస్తే, మరణాన్ని ఆయనకు భగవంతుడితో జరిగే 'వివాహం'గా చెప్పుకునేవారు.

సూఫీ సంప్రదాయాలు, బాగా ఎరిగి ఉండడం వల్ల ఖాజీ-సూఫీని నిర్దోషి అని తేల్చి, దేవుడి మనిషిగా ప్రకటించాడు. అయితే, అధిక సంఖ్యాకుల అభిప్రాయం ప్రకారం అతడొక కలేందర్ అంటే మతి స్థిమితం లేనివాడు. అందుకే అతడు మరణించి ఐదు వందల సంవత్సరాలు గడిచాక కూడా ఆయన్ను కలేందర్ సాహెబ్‌గా పిలుస్తున్నారు.

ఆయన సమాధి ప్రాంగణంలోని ఒక కట్టడంలోనే మా బడి ఉండేది. అందువల్ల దానిని 'కలేందర్ సాహెబ్ బడి' అని పిలిచేవారు. ఆ సూఫీ సాధువు సమాధి నీడలోనే మిత్రులందరం ఆటలతో మా బాల్యాన్ని గడిపాము.

తన జీవిత కాలంలోనూ, అంతకన్నా ఎక్కువగా మరణించిన తరవాతా పానిపట్టులోనూ పరిసర ప్రాంతాలలోనూ హిందూ ముస్లిం ఉభయ వర్గాలలో బూ అలీ షా కలిగించిన గౌరవ మర్యాదలు అమోఘమైనవి. స్థానిక ప్రజల మీద సూఫీ సాధువులకున్న గొప్ప ఉద్వేగ పూరిత ఆధ్యాత్మిక ప్రభావానికి తార్కాణాలు అవి.

సూఫీలు చెప్పుకో తగ్గ సంఖ్యలో హిందువులను మతమార్పిడి చేయలేదు. అయితే, స్థానిక ప్రజలతో ఆధ్యాత్మిక సంబంధాలను ఏర్పరచుకున్నారు. ఆ కాలఘట్టంలో భారత దేశంలోని ఇతర ప్రాంతాలలో, భక్తి ఉద్యమానికి చెందిన సాధువులు చేసి చూపిన మహత్తులు లాంటివే క్రమక్రమంగా వీరూ చేసి చూపినట్టు చెప్పుకోవడం ఆసక్తికర విశేషం!

ఉదాహరణకు చెప్పాలంటే సంత్ తుకారాం -దురహంకారి అయిన స్థానిక పాలకుడికి గుణపాఠం నేర్పడానికి ఒక గోడను గాలిలో ఎగిరేలా చేశాడట! అలాంటి ఉదంతమే బూ అలీ షా జీవింతంలోనూ జరిగినట్టు చెప్పుకుంటారు: ఎప్పటిలాగే చింపిరి దుస్తులతో బూ అలీ ఒకనాడు శీతాకాలపు లేత ఎండలో సగం కూలి పోయిన మొండి గోడ మీద కూర్చుని ఉన్నాడు. ఆ సమయంలో చక్కగా అలంకరించబడ్డ ఏనుగు మీద అటుగా వచ్చిన ఢిల్లీ సుల్తాన్ 'పిచ్చి' సాధువు గురించి విని ఉండడం వల్ల, ''బూ అలీ షా కలేందర్‌కు అభివాదాలు!'' అన్నాడు. సాధువు దానికి సమా

ధానం ఇవ్వలేదు. రాజుకు ఆగ్రహం కలిగి, ''ఏనుగు మీద వచ్చిన రాజు, నీతో మాట్లాడా లనుకోవడం నీకు తెలియలేదా బిచ్చగాడా!'' అని గద్దించి అడిగాడు.

సన్యాసి తలపైకెత్తి, ''నీ ఏనుగును చూసే అంతగా పొంగిపోతున్నావా, దురహంకారీ! దేవుడు సంకల్పిస్తే ఈ మొండిగోడే ఏనుగు కన్నా వేగంగా నడవగలదు,'' అని సమాధాన మిచ్చాడు.

వెంటనే గోడ కదలడం ప్రారంభించి ఏను గును దాటి ముందుకు వెళ్ళిందని పూర్వగాథ చెబుతుంది. ఆ అద్భుతాన్ని చూసిన రాజు వెంటనే ఏనుగుపై నుంచి దిగివచ్చి సన్యాసి కాళ్ళపై బడి క్షమాపణలు చెప్పుకున్నాడట!

యేటా కలేందర్ సాహెబ్ ఉరుస్ ఉత్సా హంగా జరుపుకుంటారు. అది ఒక తిరనాళ్ళ లాగా ఉండేది. విశాలమైదానంలో పెద్ద సంత ఏర్పాటయ్యేది. అక్కడ రకరకాల తినుబండా రాలూ, షర్బత్ చల్లటి పానీయాలూ అమ్మే వారు. ఆటవస్తువులు; మట్టితో చేసిన రంగు రంగుల బొమ్మలు; తెల్లటి గుర్రాలు, పచ్చటి చిలుకలు అమ్మేవారు. జపాను పట్టు, చేనేత వస్త్రాలు అంటూ రకరకాల బట్టలు అమ్మేవారు.

రాత్రుల్లో మహమ్మద్ ప్రవక్తను గురించీ, సూఫీ సన్యాసుల గురించీ మేళతాళాలతో, ఫకీర్లు చేతులకు తొడుక్కున్న రాగి గాజుల సంగీతంతో కవాలీలు ఆలపించేవారు. అప్పు డప్పుడు ఆ పాటలకు అనుగుణంగా ఒక సూఫీ లేదా సన్యాసి లేదా మామూలు మనిషి- తలను, మొత్తం శరీరాన్ని ముందుకూ వెనక్కూ ఊపుతూ, నాట్యం చేసేవాడు. పూనకం వచ్చి నట్టు అలా నాట్యం చేసే వ్యక్తిని అందరూ భయాశ్చర్యాలతో చూసేవారు. గాయకులు మరింత ఉద్వేగంతో, చప్పట్లు కొడుతూ మరింత వేగంగా పాడేవారు. 'పవిత్ర' నాట్య కారుడు స్పృహ తప్పి చలవరాతి నేలపై పడేంతవరకు సుడులు తిరుగుతూ వేగంగా నాట్యం చేసేవాడు.



మహనీయుల జీవితాల్లో ఆసక్తికర ఉదంతాలు (32)

# రెండు తూటాలకు మధ్య సుదీర్ఘ విరామం!




ఒక్క తుపాకీ గుండు దెబ్బ పరిస్థితులను మార్చి వేసిన ఉదంతాలు చరిత్రలో కొన్ని ఉన్నాయి. అయితే, పేలని తుపాకీ గుండు చరిత్ర గతినే మార్చిన ఒక విషయం గురించి ఇప్పుడు ముచ్చటించుకుందాం.

18వ శతాబ్దం ముప్ఫైలలో తన బిడ్డ దేనికీ కొరగానివాడని ఒక ఆంగ్లేయుడు భావించాడు. అలాంటి వాడికి ఇంగ్లాండులో భవిష్యత్తు ఉండదు గనక, వాణ్ణి ఇండియాకు పంపేయాలని నిర్ణయించాడు. ఈస్టిండియా కంపెనీ వ్యాపారం కోసం ఇండియాకు వచ్చినప్పటికీ, సాధ్యమైనంత దేశాన్ని వశపరచుకోవాలని ప్రయత్నించసాగింది. అందువల్ల వివిధ స్థానాలకు రకరకాల ఉద్యోగులు కావలసివచ్చారు.

మద్రాసులో అడుగుపెట్టిన ఆ యువకుడికి చిన్న గుమాస్తా ఉద్యోగం దొరికింది. జీతం ఐదు పౌండ్లు. నెలకు కాదు; సంవత్సరానికి. దాంతో బతకలేక దాన్ని వదులుకోవాలని నిర్ణయించాడు. అతడు ఒంటరివాడు. ఇతరులతో స్నేహం చేయడానికి సిగ్గుపడేవాడు. పేదరికం, ఒంటరితనం అతనికి జీవితం మీద విరక్తిని పుట్టించాయి. పిస్టల్‌లో తూటాలు నింపాడు. పిస్టల్‌ను తన వక్షస్థలానికి గురిపెట్టి ట్రిగ్గర్‌ను లాగాడు. ట్రిగ్గర్ సక్రమంగానే క్లిక్ చేసింది. అంతేగాని, ఆ తరవాత తూటా వెలుపలికి రాలేదు. ఆయుధంలో ఏదైనా లోపం ఉన్నదా? పిస్టల్‌ను కిటికీ గుండా సముద్రం కేసి గురి చేసి మళ్ళీ ట్రిగ్గర్‌ను లాగాడు. ఇప్పుడు ఎదురు చూసిన శబ్దంతో పిస్టల్ పేలింది.

"నేను బతకాలని ఉంది కాబోలు. ఏమవుతుందో చూద్దాం," అని భావించిన ఆ యువకుడు తన నిర్ణయాన్ని మార్చుకున్నాడు.

అవి బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ, ఫ్రెంచి ఈస్టిండియా కంపెనీల మధ్య స్పర్థలు తారాస్థాయిలో ఉన్న రోజులు. ఒకనాడు ఫ్రెంచి వాళ్ళు పాండిచ్చేరి నుంచి నౌకలో వెళ్ళి మద్రాసులోని బ్రిటిష్ స్థావరమైన సెయింట్ జార్జ్ కోట మీద భయంకరంగా దాడి జరిపారు. బ్రిటిష్ వాళ్ళు ఓడిపోయారు. ఇతరులతో పాటు అక్కడి నుంచి తప్పించుకున్న రాబర్ట్ క్లైవ్ అనే ఆ యువకుడు–ఈస్టిండియా కంపెనీ సైన్యాన్ని మళ్ళీ సమీకరించినప్పుడు సైనికుడుగా చేరి త్వరితగతిలో కేప్టన్ స్థాయికి ఎదిగాడు. మూడు వందల మంది భారతీయ సైనికులు, రెండు వందల మంది బ్రిటిష్ సైనికులతో కలిసి–

పన్నెండు వేల సైనికబలంగల ఫ్రెంచి వారి నుంచి ఆర్కాటుకోటను కాపాడాడు. ఈ ఫ్రెంచి సేనల ఓటమితో బ్రిటిష్ సేనల విజయపరంపర ఆరంభమయింది.

ఇప్పుడు ఆయన సంవత్సర జీతం ఒకప్పటి ఐదు పౌండ్ల నుంచి నలభైవేల పౌండ్లకు పెరిగింది. 1753లో ధనవంతుడుగా ఇంగ్లాండు చేరినక్లైవ్, రెండేళ్ళ తరవాత మళ్ళీ ఇండియాకు తిరిగి వచ్చాడు. సైనిక విషయాల పట్ల ఆయన మేధాశక్తి నిరూపితమయింది. కంపెనీ కోసం, తన సొంత లాభాలకోసం ఆయన ఎన్నో కుతంత్రాలను, కుట్రలను పన్నాడు. వ్యక్తిగత వ్యవహారాలు సాగించకూడదన్న నియమం ఉన్నప్పటికీ, దానిని అతిక్రమించి వ్యవహరించాడు. అయితే ఉన్నత అధికారిగా ఇతరులు అలా నడుచుకోవడాన్ని అడ్డుకున్నాడు!

కంపెనీ అవసరాలను సమకూర్చి సుస్థిరం చేయడానికి ఆయన కలకత్తాకు పంపబడ్డాడు. యుద్ధం ప్రకటించకుండానే బెంగాల్ నవాబు సిరాజ్-ఉద్-దౌలా మీదికి దాడి జరిపి, 1757 జూన్‌లో ప్లాసీ యుద్ధంలో ఆయన్ను ఓడించాడు. ఆ తరవాత జరిగిన మరిన్ని యుద్ధాలలో కూడా క్లైవ్ విజయం సాధించాడు. విజయం సాధించడానికి అతడు ఎలాంటి అవినీతి, అక్రమాలకైనా వెనుకాడే వాడు కాడు. సొంత అధికారులే అతడిపై తిరగబడ్డారు గాని, అతడి తెలివితేటల ముందు నెగ్గుకు రాలేకపోయారు.

ఆఖరికి పదవీ విరమణ చేసి తనకు ఘన స్వాగతం లభించగలదని కలలుకంటూ స్వదేశానికి తిరిగి వెళ్ళాడు. అతడు అనేక భవనాలను, ఎస్టేట్స్‌ను కొన్నాడు. ఇంగ్లాండులోని గొప్ప ధనికుల్లో ఒకడయ్యాడు. అయినా అతడికి ప్రజాగౌరవం లభించలేదు. లంచగొండిగా, అవినీతి పరుడిగా, క్రూరస్వభావుడిగా బ్రిటిష్ పార్లమెంటులో అనేక అభియోగాలను ఎదుర్కొన్నాడు. ''విజయం నన్ను వరించిన పరిస్థితులను కాస్త ఆలోచించి చూడండి. నా మెప్పు కోసం గొప్ప యువరాజు ఆధారపడి ఉండేవాడు. సంపన్నమైన నగరం నా దయ కోసం ఎదురు చూసేది,'' అంటూ తనను తాను సమర్థించుకోవడానికి, కాపాడుకోవడానికి ప్రయత్నించాడు.

అయితే, అవన్నీ అతడి దేశప్రజలను నమ్మించలేక పోయాయి. అతడు మరింత అశాంతికి లోనయ్యాడు. 1774లో ఒకనాడు కత్తిని తీసి పొడుచుకోబోయాడు. అయితే, ఎందుకో మనసు మార్చుకుని పిస్టల్‌ను అందుకున్నాడు. మళ్ళీ తనకు విధి ఏమని నిర్ణయించిందో తెలుసుకోవాలని అనుకున్నాడేమో తెలియదు. అయితే, ఈసారి పిస్టల్ పేలి రాబర్ట్ క్లైవ్ నేలకు ఒరిగాడు. -(ఎం.డి)



# బయటపడిన నిజం

అక్బర్ చక్రవర్తి ఒకనాడు కొలువుదీరి ఉండగా ఒక వ్యాపారి వచ్చి వంగి నమస్కరించి నిల బడ్డాడు. చక్రవర్తి ఏమిటి అన్నట్టు చూశాడు.

''షహేన్‌షా! నా పేరు మధుసూదన్ పాండే. నెయ్యి వ్యాపారం చేస్తూ బతుకుబండి లాగుతు న్నాను. అస్లాంఖాన్ అనే సాటివ్యాపారి రెండు వారాల్లో తిప్పి ఇస్తానని చెప్పి ఇరవై మొహరీలు అప్పుగా తీసుకున్నాడు. రెండు నెలలు దాటినా ఇంకా ఇవ్వలేదు,'' అన్నాడు ఆ వ్యాపారి.

''నువ్వు బాకీని అడిగావా?'' అని ప్రశ్నిం చాడు చక్రవర్తి.

''చాలాసార్లు అడిగాను ఆలంపనా! రేపు మాపు అని కొన్నాళ్ళు గడిపేశాడు. ఇప్పుడేమో నా దగ్గర అసలు అప్పు తీసుకోలేదని బుకాయిస్తు న్నాడు,'' అన్నాడు వ్యాపారి.



''అప్పు ఇచ్చినందుకు ఆధారంగా ఏదైనా పత్రం రాసి తీసుకున్నావా?'' అని అడిగాడు చక్రవర్తి. ''లేదు ప్రభూ, సాటి వర్తకుడే కదా అని నమ్మాను,'' అన్నాడు వ్యాపారి.

''నీ మాటను ఎలా నమ్మడం?'' అని మళ్ళీ ప్రశ్నించాడు చక్రవర్తి.

''నేను సత్యమే చెబుతున్నాను షహేన్‌షా,'' అని వంగి మొక్కాడు వ్యాపారి.

''నువ్వు నిజమే చెబుతున్నట్టయితే, నీ సొమ్ము నీకు తిరిగి వస్తుంది. వెళ్ళిరా,'' అని ఆజ్ఞాపించిన చక్రవర్తి, అతడు వెళ్ళగానే బీర్బల్ కేసి తిరిగి, ''ఈ వ్యవహారం ఏమిటో నువ్వు కాస్త చూస్తావా?'' అన్నాడు.

ఆ రోజు సాయంకాలం బీర్బల్ వ్యాపారిని పిలిపించి వివరాలు అడిగి తెలుసుకున్నాడు. అంతా విన్నాక, ''డబ్బు విషయంలో ఎప్పుడూ రాత పూర్వకమైన ఆధారాలు ఉండేలా చూసు కోవడం మంచిది,'' అన్నాడు సాలోచనగా.

''అస్లాంఖాన్ నాకు ఇరవైయేళ్ళుగా తెలిసిన వ్యక్తి. అందువల్లే అతణ్ణి నమ్మాను. ఎలాగైనా బాకీ వసూలయ్యేలా చూడండి,'' అన్నాడు వ్యాపారి ప్రాధేయ పడుతున్నట్టు.

''నీకు తప్పక న్యాయం జరుగుతుంది. నిశ్చింతగా వెళ్ళిరా,'' అని ధైర్యం చెప్పి పంపాడు బీర్బల్.

ఆ తరవాత బీర్బల్ అస్లాంఖాన్ కోసం కబురు చేశాడు. చక్కగా దుస్తులు ధరించిన ఒక పొడవాటి వ్యక్తి వచ్చి, ''నా పేరు అస్లాంఖాన్. తమరు రమ్మన్నారట హుజూర్,'' అన్నాడు.

''నిన్ను పిలిపించి ఇబ్బంది కలిగించినందుకు విచారిస్తున్నాను. నీ గురించి ఒకఫిర్యాదు వచ్చింది,'' అన్నాడు బీర్బల్.

''నా గురించి ఫిర్యాదా? ఆశ్చర్యంగా ఉంది బీర్బల్‌జీ. నేను చాలా నిజాయితీపరుణ్ణి. పన్నులు సక్రమంగా చెల్లిస్తున్నాను. ఎన్నడూ ఎలాంటి నేర కృత్యాలకూ పాల్పడ లేదు,'' అన్నాడు అస్లాంఖాన్ అమిత ఆశ్చర్యం కనబరుస్తూ.

బీర్బల్ మధుసూదన్ పాండే ఇచ్చిన ఫిర్యాదును తీసి అస్లాంఖాన్‌కు చూపాడు.

''నాకు కావలసినంత పొలం, సొంత ఇల్లు ఉన్నాయి. వ్యాపారం లాభసాటిగా నడుపుతున్నాను. నేనెందుకు అప్పు చేయాలి? పాండేజీ అబద్ధం చెబుతున్నాడు,'' అన్నాడు అస్లాంఖాన్ ఆవేశంతో.

''చెప్పవచ్చు... చెప్పకపోనూ వచ్చు,'' అంటూ బీర్బల్ అస్లాంఖాన్ ముఖ కవళికలను పరిశీలనగా చూసి, ''అంటే, పాండే అబద్ధం చెబుతున్నాడంటావు. అంతే కదా?'' అన్నాడు.

''అల్లా నాకు కావలసినంత ఇచ్చాడు. ఎవరి దగ్గరా అప్పు చేయవలసిన అవసరం నాకు లేదు,'' అన్నాడు అస్లాంఖాన్.

''సరే,'' అని మాట మార్చడానికి ప్రయత్నిస్తూ ఉన్నట్టుండి ఏదో జ్ఞాపకం వచ్చినవాడిలా బీర్బల్ అస్లాంఖాన్ చేయిపట్టుకుని, ''నాకో సాయం చేస్తావా?'' అని అడిగాడు.



''ఆజ్ఞాపించండి, బీర్బల్‌జీ,'' అంటూ చిన్నగా నవ్వాడు అస్లాంఖాన్.

''ఒక నెల క్రితం మా గ్రామంలో వున్న నా మిత్రుణ్ణి ఒక డబ్బా స్వచ్ఛమైన నెయ్యి పంపమని చెప్పాను. అతడు రెండు డబ్బాలు పంపాడు. రెండో డబ్బా నెయ్యిని ఏం చెయ్యాలో తెలియడం లేదు,'' అంటూ ఆగాడు బీర్బల్ అస్లాంఖాన్ స్పందన కోసం.

''నేను దాన్ని అమ్మి డబ్బు పంపుతాను,'' అన్నాడు అస్లాంఖాన్.

''కృతజ్ఞతలు. నేతి డబ్బాను రేపు పంపుతాను,'' అంటూ అస్లాంఖాన్‌ను ఆప్యాయంగా కౌగిలించుకుని సాగనంపాడు బీర్బల్.

మరునాడు మధుసూదన్ పాండేను పిలిపించి, ''పాండేజీ, నాకో సాయం చెయ్యాలి. కిందటి నెలలో మా గ్రామంలో వున్న నా మిత్రుణ్ణి



ఒక డబ్బా స్వచ్ఛమైన నెయ్యిని పంపమని కోరాను. అతడేమో రెండు డబ్బాలు పంపాడు. రెండో డబ్బా నెయ్యిని ఏం చెయ్యాలో తెలియడం లేదు. దాన్ని నువ్వు అమ్మి పెట్టాలి,'' అన్నాడు.

''అదెంత పని? వచ్చి తీసుకోమన్నారా?'' అని అడిగాడు పాండే.

''వద్దు. మధ్యాహ్నానికి మనిషి చేత నేనే పంపుతాను,'' అని చెప్పి అతణ్ణి పంపేశాడు బీర్బల్.

ఆ రోజు మధ్యాహ్నమే ఇద్దరు వ్యాపారులకూ తలా ఒక డబ్బా నెయ్యి పంపడం జరిగింది.

సాయంకాలం బీర్బల్ మొక్కలకు నీళ్ళు పడుతూండగా మధుసూదన్ పాండే హడావుడిగా వచ్చి, ''డబ్బా లోపల ఒక బంగారు మొహరీ కనిపించింది. నేతిని అమ్మగా వచ్చిన మొత్తం ఇది,'' అంటూ రెండింటినీ ఇచ్చాడు.

''నేతి డబ్బాలో బంగారు మొహరీ! ఈ రోజు నాకు చాలా అదృష్టం అనుకుంటాను,'' అన్నాడు బీర్బల్ నవ్వుతూ.

''బీర్బల్‌జీ! నా ఫిర్యాదు సంగతి ఏమయింది?'' అని అడిగాడు పాండే.

''విచారణ జరుపుతున్నాను. రేపు సాయంకాలం వరకు ఓపిక పట్టు,'' అన్నాడు బీర్బల్.

మరునాడు ఉదయం అస్లాంఖాన్ బీర్బల్ వద్దకు వచ్చి, ''హుజూర్, మీరు పంపిన నెయ్యి అమ్మగా వచ్చిన డబ్బు ఇదిగో, తీసుకోండి,'' అంటూ డబ్బును అందించాడు.

''కృతజ్ఞతలు,'' అంటూ డబ్బును అందుకున్న బీర్బల్, ''అరరే, మరిచిపోయానే. ఇప్పుడే వస్తాను ఉండు,'' అంటూ అక్కడి నుంచి గబగబా మెట్లు దిగాడు. అస్లాంఖాన్ అక్కడే నిలబడ్డాడు. బీర్బల్ మరి కొంత ముందుకు వెళ్ళి తన సేవకుణ్ణి పిలిచి, ''అస్లాంఖాన్ ఇంటికి వెళ్ళి, నిన్న నేతి డబ్బాలో దొరికిన బంగారు మొహరీని ఆయన తెమ్మంటున్నాడని వాళ్ళబ్బాయికి చెప్పిరా,'' అని మెల్లగా చెప్పాడు. ఆయన మాటలు అస్లాంఖాన్‌కు వినిపించలేదు. సేవకుడు బయలుదేరాక బీర్బల్ అస్లాంఖాన్ దగ్గరికి తిరిగి వచ్చి ఆమాట ఈమాట మాట్లాడసాగాడు. కొంతసేపటికి సేవకుడు పదేళ్ళ కుర్రాణ్ణివెంటబెట్టుకుని వచ్చాడు. కుర్రవాడు అస్లాంఖాన్ దగ్గరికి పరిగెత్తి పోయి, ''ఇదిగో నాన్నా, నేతి డబ్బాలో దొరికిన బంగారు మొహరీ,'' అంటూ దానిని ఇచ్చాడు.

''నేతి డబ్బాలో బంగారు మొహరీ ఏమిటి నీ మొహం,'' అంటూ మాట మార్చడానికి చూశాడు అస్లాంఖాన్.

''అదేనాన్నా, డబ్బాలోని నేతిని కరిగించి మరో పాత్రలోకి పోస్తున్నప్పుడు దొరికింది కదా? అదే...'' అని కొడుకు అంటూండగా, అస్లాం ఖాన్ అడ్డుపడి కోపంగా, ''అప్పుడు నేను వంగితే, నా దుస్తుల నుంచి జారికింద పడింది. నువ్వు నోరు మూసుకో,'' అంటూ బీర్బల్ కేసి తిరిగి సర్ది చెప్పబోయాడు.

''మీ అబ్బాయి నిజం చెప్పాడు. నేనే నేతి డబ్బాలో బంగారు మొహరీని వేశాను,'' అన్నాడు బీర్బల్.

అస్లాంఖాన్ గతుక్కుమన్నాడు. భయాన్ని కప్పిపుచ్చుకుంటూ, బీర్బల్ చేయిపట్టుకుని, ''ఆ నాణెం నా దుస్తుల నుంచి పడిందేమోనని నేనే పొరబడినట్టుంది. నాదేపొరబాటు. ఇదిగో తీసుకోండి. మీ నాణెం,'' అన్నాడు.

''దీని సంగతి సరే. మరి మధుసూదన్ పాండే నుంచి తీసుకున్న ఇరవై మొహరీల మాటేమిటి?'' అని అడిగాడు బీర్బల్.

'నేనతనికి బాకీ లేదు,'' అన్నాడు అస్లాంఖాన్.

''అబద్ధాలాడకు. ఒక్క మొహరీ విషయం లోనే నీ దొంగబుద్ధి బయటపడి పోయింది కదా? నిజం చెప్పక పోయావో జైలు ఊచలు లెక్కించక తప్పదు,'' అని హెచ్చరించాడు బీర్బల్ కఠినమైన కంఠస్వరంతో.

ఇకతనపాచికపారదని గ్రహించిన అస్లాంఖాన్, ''క్షమించండి హుజూర్! మధుసూదన్ పాండేకు బాకీ పడ్డ ఇరవై మొహరీలు వెంటనే తీర్చేస్తాను,'' అంటూ బీర్బల్ పాదాలపై పడ్డాడు.

## మన దేశం క్విజ్

పురాణాల గురించిన మన పరిజ్ఞానాన్ని ఈ నెల క్విజ్ ద్వారా ఒకసారి పరిశీలించుకుందాం



1. గాయత్రీమంత్రం ఎవరిని ఉద్దేశించినది?
2. నెమలి వాహనంగా గల దేవత ఎవరు?
3. వసిష్ఠుడి ఆశ్రమం నుంచి విశ్వామిత్రుడు బలవంతంగా తీసుకువెళ్ళడానికి ప్రయత్నించిన గోవు పేరేమిటి?
4. గంగను దివి నుంచి భువికి తీసుకువచ్చిన ఘనుడు ఎవరు?
5. హనుమంతుడి తండ్రి ఎవరు?
6. రావణ సంహారానంతరం లంకకు రాజైన వారెవరు?

(సమాధానాలు 74వ పేజీలో)

# అవీ-ఇవీ...

## క్రీడాకారుల తొలిరోజులు

చార్లెస్ పెడాక్ అప్పటికి ఇంకా బడిలో చదువుకుంటున్నాడు: ''నేను ప్రపంచపు అతి వేగమైన స్ప్రింటర్ కావాలి. అందుకు నేనేం చెయ్యాలి?'' అని అడిగాడు కోచ్‌ని. ''నీ మోకాళ్ళను పైకెత్తి కాళ్ళను పిస్టన్స్‌లా ఆడించు,'' అని సలహా ఇచ్చాడు కోచ్. అంట్వెర్ప్ (1920) క్రీడలలో, పెడాక్ 100 మీ.లను 10.8 సెకనులలో పరిగెత్తి బంగారు పతకం సాధించాడు. కొన్ని సంవత్సరాల తరవాత ఒక విద్యార్థుల సమావేశంలో ఉపన్యసించడానికి అతణ్ణి ఆహ్వానించారు. ''బహుశా, మీలోనే ఒక ఒలింపిక్ ఛాంపియన్ ఉండవచ్చు,'' అని ఆయన అన్నప్పుడు కలకలం పుట్టింది. ఒక కుర్రవాడు అతని దగ్గరికి వెళ్ళి, ''మీలాంటి ఛాంపియన్ కావడానికి నేను ఏం చెయ్యడానికైనా సిద్ధంగా ఉన్నాను,'' అన్నాడు. పెడాక్ కొన్ని చిట్కాలు చెప్పాడు. ఆ కుర్రాడి పేరు జెస్సీ ఓవెన్స్. ఉత్తరోత్తరా బెర్లిన్ (1936) గేమ్స్‌లో నాలుగు బంగారు పతకాలు సాధించాడు. కొన్నేళ్ళ తరవాత ఓవెన్స్ ఆటోగ్రాఫ్ ఇవ్వడానికి తన కారును ఆపాడు. ఒక కుర్రవాడు అతణ్ణి పలకరించి, ''మీలాగా ఒలింపిక్ ఛాంపియన్ కావడానికి నేనేం చేయడానికైనా వెనుకాడను, మిస్టర్ ఓవెన్స్,'' అన్నాడు. జెస్సీ ఓవెన్స్ అతనికి చార్లెస్ పెడాక్‌తో తన తొలి పరిచయం గురించీ, అతడు అందించిన చిట్కాల గురించీ వివరించాడు. ఆ కుర్రవాడి పేరు హారిసన్ డిల్లార్డ్. అతడు లండన్ (1948) క్రీడల్లో 100 మీ. 10.3 సెకనులలలో పరిగెత్తి ఓవెన్స్ రికార్డును అందుకున్నాడు.



జెస్సీ ఓవెన్స్


ఫారెస్ట్ స్మిత్సన్


హారిసన్ డిల్లార్డ్

## బైబిల్ మీద నమ్మకం

లండన్ (1908) గేమ్స్‌లో ఫారెస్ట్ స్మిత్సన్ 110మీ. హర్డిల్స్ ఫైనల్స్‌లో పరిగెత్తవలసి ఉన్నది. ఆ పందెం ఆదివారం రావడంతో పరిగెత్తడానికి స్మిత్సన్ నిరాకరించాడు. ఆఖరికి అందరూ కలిసి పరిగెత్తడానికి అతణ్ణి ఒప్పించారు. అలా పరిగెత్తేప్పుడు అతడు హోలీ బైబిల్‌ను వెంట తీసుకువెళ్ళాడు. బంగారు పతకం సాధించాడు!


చార్లెస్ పెడాక్

## పొరుగువారి వితరణ

హాలండుకు చెందిన ఫ్యానీ బ్లాంకర్స్ కోయెన్, లండన్ (1948) గేమ్స్‌లో 100 మీ. 200 మీ. 80 మీ. హర్డిల్ మరియు 100 మీ. రిలేలో బంగారు పతకాలు సాధించింది. లాంగ్‌జంప్‌లో విజయం సాధించడం పట్ల అంత ఆసక్తి కనబరచలేదు. తన సొంత పాత ప్రపంచ రికార్డుకన్నా, 50 సెం.మీ. తక్కువ దూకింది. ఆమె అంస్టర్‌డ్యామ్‌కు తిరిగి వచ్చినప్పుడు పొరుగింటి వాళ్ళు, ''అంత ఎక్కువ పరిగెత్తుతున్నావు కదా!'' అంటూ సైకిల్‌ను బహూకరించారు.


బ్లాంకర్స్ కోయెన్

## కాశ్మీరు జానపద కథ

# సాధువు వింత నిబంధన!

రాజ్‌పూర్ పాలకుడు దయామయుడైన రాజు. ప్రజల క్షేమమే ప్రధానంగా భావించేవాడు. ఆయన భార్య కూడా ప్రజలను కన్న బిడ్డల్లా భావించేది. ప్రజలు సైతం రాజదంపతులను అపరమిత భక్తిగౌరవాలతో చూసేవారు. వారి కోసం తమ ప్రాణాలను సైతం ఇవ్వడానికి సిద్ధంగా ఉండేవారు.

రాజదంపతులకు చాలా కాలం వరకు సంతానం కలగలేదు. తన తదనంతరం సింహాసనానికి వారసుడు ఎవరా అని రాజు బెంగపడేవాడు. తాము మరణిస్తే తమ అంత్యక్రియలు జరపడానికి తమ కడుపున పుట్టిన బిడ్డ లేక పోయాడే అని రాజదంపతులు విచారపడ సాగారు.

రాజదంపతులు క్రమం తప్పకుండా గుడులకు, గోపురాలకు వెళ్ళి పూజలు జరిపేవారు. సంతాన ప్రాప్తికోసం రాజు యేటా పురోహితులతో యాగాలు చేయించేవాడు. యోగులను ఆహ్వానించి దైవ కృప పొందడం కోసం ప్రత్యేక పూజలు జరిపించేవాడు. దానధర్మాలు చేసేవాడు. రాణి కూడా ఎన్నో వ్రతాలు, నోములు ఆచరించేది.

ఇలా ఉండగా ఒకనాడు రాజభవనంలోకి, ''అలక్ నిరంజన్!'' అన్న శబ్దం వీధిలో నుంచి బిగ్గరగా వినిపించింది. ఎవరో చూసిరమ్మని రాణి పరిచారికను పంపింది. పరిచారిక వెలుపలికి వచ్చి భవనం ముందు నొసటి మీద, చేతుల మీద విభూతి రేఖలతో, మెడలో రుద్రాక్ష మాలతో, పొడవాటి గడ్డం జడలు కట్టిన జుట్టుతో ఒక చేత కమండలం, మరొక చేత శూలం పట్టుకుని నిలబడివున్న సాధువును చూసి సంభ్రమాశ్చర్యాలకు లోనయింది. ఆయన అప్పుడప్పుడు గంభీర కంఠస్వరంతో,





''అలక్ నిరంజన్!'' ''అలక్ నిరంజన్!'' అంటున్నాడు బిగ్గరగా.

పరిచారిక లోపలికి తిరిగి వెళ్ళి మహారాణికి సాధువు రూపాన్ని వివరించి, ''సాక్షాత్తు పరమ శివుడే వచ్చినట్టున్నాడు మహారాణీ!'' అన్నది. మహారాణి పరిచారికను వెంటబెట్టుకుని భవనం వెలుపలికి వచ్చి సాధువు పాదాలకు నమస్కరించి లోపలికి తీసుకువచ్చి, భక్తిశ్రద్ధలతో ఉచితాసనంపై కూర్చోబెట్టి, ''మీకేం కావాలో చెప్పండి, మహాత్మా,'' అని అడిగింది వినయంగా.

సాధువు ఆమెను దీవించి, 'నేను సర్వం పరిత్యజించిన సాధువును. నిత్యసంచారిని. నాకు కావలసిందేమీ లేదు. నీకేం కావాలో కోరుకో, నెరవేరేలా వరమిస్తాను,'' అన్నాడు.

మహారాణి భక్తితో చేతులు జోడించి, ''భగవత్కృప వల్ల మాకు సంపన్నమైన విశాల రాజ్యం, మాపై విశ్వాసంగల ప్రజలు; సకల సంపదలు సమకూరాయి. ఒక్క సంతాన భాగ్యం మాత్రం ఇంతవరకు కలగలేదు. మొక్కని దేవుడు లేదు. చేయని వ్రతం లేదు. అయినా ఈ విషయంలో ఇంతవరకు భగవంతుడికి మా మీద కరుణ కలగలేదు. రాజ్య సింహాసనానికి వారసుడు లేకుండా పోయే ప్రమాదం తప్పించడానికి దయచేసి పుత్ర భాగ్యం కలిగేలా ఆశీర్వదించండి, మహాత్మా!'' అని వేడుకున్నది.

''నీ కోరిక తప్పకనెరవేరుతుంది,'' అంటూ చేయెత్తి దీవించిన సాధువు, ''అయితే, నీ కుమారుడికి పన్నెండేళ్ళు రాగానే నేను వచ్చి తీసుకువెళతాను. అలక్ నిరంజన్!'' అంటూ మహారాణి ఏదో చెప్పబోయేంతలో సాధువు అదృశ్యమైపోయాడు.

ఎవరో దివ్యపురుషుడు వచ్చి తనను ఆశీర్వదించి వెళ్ళినట్టే రాణి భావించింది. రాజు రాగానే సాధువు వివరించిన నిబంధనతో సహా జరిగినదంతా వివరించింది.

అన్నీ విన్న రాజు తలపంకించి, ''పుట్టబోయే బిడ్డ శాశ్వతంగా మన దగ్గరే ఉండేలా చేయమని దేవుణ్ణి ప్రార్థిద్దాం,'' అన్నాడు.

యేడాది తిరిగే సరికి రాణి పండంటి మగ బిడ్డను ప్రసవించింది. రాజదంపతుల ఆనందానికి అవధుల్లేకుండా పోయాయి. ప్రజలు కూడా పరమానందం చెందారు. రాజ్యమంతటా కొన్ని రోజుల పాటు విందులూ, వినోదాలూ, ఉత్సవాలూ జరిగాయి. యువరాజుకు

నిరంజన్ అని పేరు పెట్టారు. తల్లిదండ్రులు అతణ్ణి అలక్ అనిపిలిచేవారు.

బిడ్డను అల్లారు ముద్దుగా ఎంతో జాగ్రత్తగా పెంచుతూ మూడేళ్ళ ప్రాయంలోనే విద్య నేర్పడానికి గురువులను ఏర్పాటు చేశారు. పదేళ్ళు రాగానే యుద్ధవిద్యలలో శిక్షణనివ్వడం ప్రారంభించారు.

సాధువు విధించిన నిబంధనను రాజ దంపతులు మరిచిపోలేదు. అలక్‌కు పన్నెండేళ్ళు పూర్తవుతూండగా వారి మనసులలో ఒక విధమైన భయం చోటుచేసుకోసాగింది. సాధువు ఎప్పుడెప్పుడు వస్తాడా అని వాళ్ళు భయం భయంగా రోజులు లెక్కించసాగారు. ఒక నాడు రాణి రాజుతో, ''అవునూ, మన నిరంజన్ జన్మించి పన్నెండేళ్ళయిందని సాధువుకు ఎలా తెలుస్తుంది?'' అని అడిగింది.

''నువ్వు చూస్తూండగానే అదృశ్యమైపోయిన తపోసంపన్నుడికి ఎప్పుడు ఎక్కడ ఏం జరుగుతున్నదీ తెలియకుండా ఉంటుందా? అలాంటి వారికి దివ్యశక్తులు ఉంటాయి,'' అన్నాడు రాజు.

రోజులు గడుస్తున్నప్పటికీ సాధువు జాడ కనిపించలేదు. ఆయన రాకుండా ఉంటే బావుంటుందికదా అనుకునేవారు. మరి కొన్నాళ్ళకు ఆయన్ను గురించి ఆలోచించడం కూడా మరిచిపోయారు రాజదంపతులు.

యువరాజు పన్నెండవ జన్మదినోత్సవం జరుగుతూండగా రాజభవనం ముందు, ''అలక్ నిరంజన్!'' అనే మాట దిక్కులు పిక్కటిల్లేలా వినిపించింది. తమ బిడ్డను తీసుకెళ్ళడానికి సాధువు వచ్చాడని గ్రహించిన రాజు భవన ద్వారం వద్దకు పరిగెత్తి వెళ్ళి సాధువు పాదాలకు నమస్కరించి, ''స్వాగతం, మహాత్మా. మా నివాసాన్ని పావనం చెయ్యండి,'' అంటూ లోపలికి తీసుకువచ్చాడు.

''మీ కుమారుణ్ణివెంటబెట్టుకు వెళ్ళడానికే వచ్చాను. నా దీవెన పొందడానికి ముందు నీ భార్య నా నిబంధనకు అంగీకరించింది. ఆమె ఎక్కడ?'' అని అడిగాడు సాధువు గంభీరమైన కంఠస్వరంతో.

''ఇప్పుడే పిలిపిస్తాను, మహాత్మా,'' అని రాజు చెబుతూండగానే సంగతి తెలిసి రాణి కొడుకును వెంటబెట్టుకుని అక్కడికి వచ్చి సాధువు పాదాలకు సాష్టాంగ నమస్కారం చేసింది. ఆ తరవాత మోకాళ్ళపై కూర్చుని చేతులు జోడించి, ''మహాత్మా, లేకలేక కలిగిన బిడ్డను ప్రాణప్రదంగా పెంచుతున్నాం. వాణ్ణి





చూడకుండా ఒక్క రోజు కూడా ఉండలేము. కరుణించి వాణ్ణి మీ వెంట తీసుకు వెళ్ళకండి,'' అని ప్రార్థించింది.

అప్పుడు సాధువు, ''బిడ్డా, మీరు మీ ప్రజలను కన్న బిడ్డల్లా చూసుకుంటారని నాకు తెలుసు. మీకంటూ సంతానం కలిగిన తరవాత కూడా ప్రజల పట్ల మీ ప్రేమ ఇసుమంత కూడా తరగకుండా ఉండడం ప్రశంసనీయం. అందువల్ల, మీ కొడుకును ఇప్పుడు నావెంట తీసుకువెళ్ళినా మీకు వాటిల్లే లోపం పెద్దగా ఉండదు,'' అన్నాడు.

''మీరు మాకు మరేదైనా నిబంధన విధించండి సంతోషంగా స్వీకరిస్తాము. మా బిడ్డ మాత్రం మా దగ్గరే ఉండేలా కనికరించండి. వాణ్ణి మా నుంచి వేరుచేయకండి,'' అని మళ్ళీ ప్రాధేయపడింది రాణి కన్నీళ్ళతో.

''యువరాజు నాతో ఈ రోజు రావలసిందే. ఆ నిర్ణయంలో ఎలాంటి మార్పులేదు. అయితే, ఆరేళ్ళ తరవాత అంటే అతడు పద్ధెమిదేళ్ళ ప్రాయంవాడు కాగానే తెచ్చి మీకు అప్పగిస్తాను. అంతవరకు నావద్దే ఉంటాడు. అతడి ఉజ్వల భవిష్యత్తుకు ఇప్పుడతడు నావెంట ఉండడం చాలా అవసరం...'' అన్నాడు సాధువు.

''మీ అభీష్టానుసారమే చేయండి, మహాత్మా. అతడు మా వద్ద లేనప్పుడు మేము చేయవలసినదేమైనా ఉంటే సెలవివ్వండి,'' అన్నారు రాజదంపతులు.

''అతడు మీవద్ద లేనప్పుడు మీరు అతడి కోసం వెతికించకూడదు. అతని రాక కోసం ఎదురు చూడండి చాలు. అదే మీకు అతడి తల్లిదండ్రులుకావడానికి అర్హతనిస్తుంది. ఈ నిబంధన వింతగా అనిపించినా దీని వల్ల మీ కుమారుడికి మేలు జరుగుతుంది,'' అని రాజదంపతులకు చెప్పి, సాధువు యువరాజుకేసి తిరిగి, అతడి చేయి పట్టుకుని, ''నా వెంట, రా,'' అంటూ రాజభవనం నుంచి వెలుపలికి తీసుకువెళ్ళాడు.

రాజదంపతులు తరవాతి ఆరు సంవత్సరాల పాటు పూజాపునస్కారాలతో, నిత్యప్రార్థనలతో గడిపారు. కాలం నెమ్మదిగా, బరువుగా గడవ సాగింది. ప్రజలకు ఎలాంటి లోటూ రాకుండా చూసుకోసాగారు. అయితే కుమారుణ్ణి వెతికే ప్రయత్నం మాత్రం చేయలేదు. సాధువు మాటలపైపరిపూర్ణవిశ్వాసం ఉంచారు. ఆరు సంవత్సరాల తరవాత ఆయన తప్పక తమ బిడ్డను తెచ్చి అప్పగించగలడని ఎదురు చూడసాగారు.

ఆఖరికి యువరాజు పద్ధెనిమిదవ జన్మదినం రానే వచ్చింది. ఆయన అక్కడ లేక

## చందమామ క్విజ్-5 (జూన్ 2008) సమాధానాలు

1. ఫిబ్రవరి నెల పనిచేసే ఆఖరి రోజు 2. దాదాభాయ్ నౌరోజీ 3. సర్దార్ వల్లభాయ్ పటేల్ 4. 1935లో; 1948 5. స్టేంట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా; ఇంపీరియల్ బ్యాంక్ (స్వాతంత్ర్యానికి ముందు) 6. అక్కడే నేషనల్ స్టాక్ ఎక్స్చేంజ్ (1992)తో పాటు బాంబే స్టాక్ ఎక్స్చేంజ్ (1875) కూడా ఉన్నది 7. ప్రధాన మంత్రి 8. కేరళ; పశ్చిమ బెంగాల్ 9. ఒరిస్సా 10. వస్త్ర పరిశ్రమ.

పోయినా, యేటా జరుపుకునేలా యువరాజు జన్మదినోత్సవ వేడుకలు కోలాహలంగా జరుగుతున్నాయి. ఉన్నట్టుండి రాజవీధిలో, ''అలక్ నిరంజన్!'' అన్న గంభీర కంఠస్వరం వినిపించింది. అది సాధువు కంఠస్వరమే అయివుంటుందని ఊహించిన రాజదంపతులు పరుగు పరుగున భవనం వెలుపలికి వచ్చారు. ఎదుట దివ్య తేజస్సుతో సాధువూ, నవయౌవన రూపంలో తమ కుమారుడూ కనిపించారు. యువరాజు వచ్చి తల్లిదండ్రుల పాదాలకు నమస్కరించాడు. ఆనందబాష్పాలతో అతణ్ణి అక్కున చేర్చుకున్న రాజదంపతులు సాధువు పాదాలకు భక్తిగౌరవాలతో నమస్కరించారు.

''నా మాట ప్రకారం నడుచుకుని, యువరాజుకు తగిన తల్లిదండ్రులని నిరూపించుకున్నారు. చాలా సంతోషం. అయితే ఒక్క మాట. గత ఆరేళ్ళు యువరాజు నాతో ఎక్కడ ఎలా గడిపినదీ ఎవరికీ చెప్పనని నాకు మాట ఇచ్చాడు. మీరు కూడా అతణ్ణి ఆ విషయం గురించి ఎన్నటికీ అడగకూడదని ఆదేశిస్తున్నాను. భగవంతుడు మిమ్మల్నందరినీ ఏ కొరతా లేకుండా రక్షించుగాక!'' అని ఆశీర్వదించి సాధువు అదృశ్యమైపోయాడు.

యువరాజు సమక్షంలో ఆయన జన్మదినోత్సవ వేడుకలు మరింత ఉత్సాహంతో ఘనంగా కొనసాగాయి!



## చిరస్మరణీయ చారిత్రక ఘట్టాలు - 11

# అంతుచిక్కని నానా రహస్యం!

అది 1857 సం. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం భగ్గుమన్న కాలం. దొండూపంత్ పేరు వినగానే బ్రిటిష్ ప్రభుత్వం గడగడలాడ సాగింది. అతణ్ణి ప్రాణాలతోనో, శవంగానో పట్టిచ్చినవారికి గొప్ప బహుమతి ఇస్తామని ప్రకటించింది. బ్రిటిష్ ప్రభుత్వాన్ని అంతగా హడలెత్తించిన ఆ దొండూపంత్ ఎవరు?

ఆయనే సుప్రసిద్ధ స్వాతంత్ర్య సమర యోధుడైన నానా సాహెబ్. ఆయన మహారాష్ట్రలోని ఒక కుగ్రామంలో 1824సం. జన్మించాడు. 1827లో వాళ్ళ కుటుంబం బితూర్ పాలకుడు రెండవ పీష్వాబాజీరావు సంస్థానానికి తరలివెళ్ళింది. చురుకైన బిడ్డ అందరి దృష్టినీ ఆకర్షించాడు. బాజీరావు ప్రత్యేక అభిమానానికి పాత్రుడయ్యాడు. బాజీరావు అతణ్ణి ఒడిలో కూర్చోబెట్టుకుని లాంఛన ప్రాయంగా దత్తత చేసుకున్నాడు. చురుకైన వాడూ, ధైర్యశాలీ అయిన నానా యుద్ధ విద్యలనూ, పాలనా వ్యవహారాలనూ నేర్చుకున్నాడు. పీష్వాల రాజ్యాన్ని బ్రిటిష్ ఆక్రమించి, యేటా ఎనిమిది లక్షల రూపాయలు నష్టపరిహారంగా చెల్లిస్తూ ఉండేది. ఆ సంస్థానం మళ్ళీ తమ వశం కాగలదని నానా చిన్నప్పటి నుంచే కలలు గనసాగాడు.

1851లో రెండవ బాజీరావు మరణించే ముందు తన తదనంతరం తన సర్వహక్కులూ నానాసాహెబ్‌కు సంక్రమించాలని వీలునామా రాశాడు. అయితే ఈస్ట్ ఇండియా కంపెనీ బ్రిటిష్ పాలకులు పీష్వాకు దత్తత తీసుకునే హక్కు లేదని ప్రకటించి ఇస్తున్న భరణాన్ని ఆపివేశారు. యువకుడైన నానాసాహెబ్ ఆగ్రహం చెందాడు. పీష్వాజీ వీలునామాను ఏక పక్షంగా తిరస్కరించి ఉభయ పక్షాల మధ్య ఏర్పరచుకున్న ఒప్పందం అతిక్రమించబడినట్టయితే రెండవ పక్షం తన రాజ్యాన్ని వెనక్కు తీసుకుంటుంది అని కంపెనీకి లేఖరాశాడు.

అయితే దురహంకార పూరితమైన కంపెనీ ఆయన ఆస్తిపాస్తులను ఆక్రమించగలమని బెదిరించింది. తరతరాల పవిత్ర సంప్రదాయమైన దత్తస్వీకారాన్ని హేళన చేసింది.

ఆ తరవాత ఎదురు తిరిగిన సిపాయిలు సాహస వీరుడైన నానాసాహెబ్‌ను తమ నాయకుడిగా గుర్తించారు. ఆయన సేనలను సమీకరించసాగాడు. తమ్ములు, సమర్థుడైన సేనాధిపతి తాంతియా తోపే, ధీశాలి అయిన సలహాదారు అజిముల్లాఖాన్ మొదలైన వారి



సాయంతో-వీరనారి ఝాన్సీ లక్ష్మీబాయి, వృద్ధ కిశోరం జగదీశ్ పూర్ కున్వర్ సింగ్‌తో సహా తెల్లవారిపై పోరాటం ప్రారంభించాడు.

"మేము మీపై దాడి చేయబోతున్నాం. అందుకే మిమ్మల్ని ముందుగా హెచ్చరిస్తున్నాం!" అంటూ నానాసాహెబ్ బ్రిటిష్ సేనాధిపతి సర్ హగ్ వీలర్‌కు లేఖ పంపాడు. ఆ యువనాయకుడి ఉన్నత స్వభావానికి బ్రిటిష్ సేనాధిపతి అబ్బుర పోయాడు. కావాలంటే నానా ఆకస్మికంగా దాడి జరిపి ఉండవచ్చు. అలా కాకుండా యుద్ధానికి సన్నద్ధం కావడానికి శత్రువును హెచ్చరించి కాల అవకాశం ఇచ్చాడు!

నానాసాహెబ్ సేనలు బ్రిటిష్ స్థావరంపై దాడి జరిపాయి. కోట గోడలపైకి ఎక్కి శత్రు సేనలను చిన్నాభిన్నం చేశాయి. తుపాకులు, ఫిరంగులు నిప్పులు చిమ్ముతూ నానా బీభత్సం సృష్టించాయి. కోటలోని పురుషులు, స్త్రీలు, పిల్లలు హాహాకారాలు చేస్తూ అటూ ఇటూ పరిగెత్త సాగారు. దాడికి తోడు వేసవి సూర్యుడు నిప్పులు చెరిగాడు. బ్రిటిష్ సైనికులు ఒకరి తరవాత ఒకరుగా నేలకొరగసాగారు. తక్కిన వారు ఆకలి దప్పులతో అలమటించారు. మూడు వారాలు భయంకర పోరాటం సాగింది. ఆఖరికి నిస్సహాయుడైన జనరల్ వీలర్, "మేము చచ్చి పోతున్నాం, కాపాడండి!" అంటూ అధిష్ఠానికి దూతను పంపాడు. అయినా సాయం అందలేదు.

అది 1857 జూన్ 23వ తేదీ. సరిగ్గా అప్పటికి వంద సంవత్సరాల క్రితమే ఆంగ్లేయ దురాక్రమణదారులు ప్లాసీ యుద్ధంలో గెలుపొంది భారత భూభాగంపై వలస రాజ్యానికి పునాది వేశారు. అదే రోజునే బ్రిటిష్ పాలనకు అంతం కూడా ఆరంభమయింది! వాళ్ళు ఆ యుధాలను అప్పగించి తప్పుకోవడంతో కాన్పూర్‌లో బ్రిటిష్ దొరతనం ఆనవాళ్ళు తుడిచి వేయబడ్డాయి. పీష్వా నానా సాహెబ్ హర్షధ్వానాల మధ్య బితూర్ రాజభవనంలో సింహాసనాన్ని అధిష్ఠించాడు!

అయితే, బ్రిటిష్ వారికి అపజయం, అవమానంతోపాటు భారత దేశంలో మనుగడకే ముప్పువాటిల్లడంతో ఇది పెద్ద సవాలుగా పరిణమించింది. జనరల్ హావ్‌లాక్ నాయకత్వంలో పెద్ద సైన్యం కాన్పూరు కేసి బయలుదేరింది. మార్గ మధ్యంలోని గ్రామాలను, పట్టణాలను దోచుకుంటూ, నాశపరుస్తూ వెళ్ళారు. అడ్డుకున్న నానాసాహెబ్ సైన్యాన్ని ఓడించారు. త్వరలో కాన్పూర్‌లో యుద్ధ భేరీలు మోగాయి. హావ్‌లాక్ సేనలతో కాన్పూరును ముట్టడించాడు. నానాసాహెబ్ గట్టిగా ఎదుర్కొన్నాడు. అయితే, హావ్‌లాక్ సైనికులు అధిక సంఖ్యాకులు; సుశిక్షితులైన వారు. పైగా, హావ్‌లాక్ యుద్ధ విద్యలో ఆరితేరినవాడు. నానాసాహెబ్ వెనుతిరగక తప్పలేదు.



ఉప్పొంగిన ఉత్సాహంతో బ్రిటిష్ సేనలు ''గాయపడ్డ సింహం మీదికి రాబందుల్లా'' నగరంలో జొరబడ్డాయి. హత్యలు, దోపిడీలు, గృహదహనాలు విచ్చల విడిగా జరిగాయి. నానాసాహెబ్ జాడ కనిపించలేదు. బితూర్‌కు వెళ్ళి వుంటాడన్న అనుమానంతో హేవ్‌లాక్ సేనలతో అక్కడికి బయలుదేరాడు.

బ్రిటిష్ సేనలు పీష్వాభవనంపై విరుచుకు పడ్డాయి. కాని నానాసాహెబ్ జాడ కనిపించ లేదు. కంపెనీ పాలనకు బలమైన శత్రువైన అతణ్ణిఎలాగైనాపట్టుకోవాలని నానా ప్రయత్నాలు చేసింది. ఆ ప్రాంతమంతా గాలింపు చర్యలను చేపట్టింది. అతణ్ణి పట్టిచ్చినవారికి గొప్ప బహు మతులు ప్రకటించింది.

ఒకనాడు స్థానిక ప్రముఖుడి ఇంటికి నానా సాహెబ్ వచ్చి ఉన్నట్టు నిఘా సంస్థలు తెలియ జేశాయి. దళనాయకుడు కొందరు భటులతో వెళ్ళి నానాసాహెబ్ ఆ ఇంటి నుంచి ఎప్పుడె ప్పుడు బయటకు వస్తాడా అని కాపు వేశాడు. చాలా సేపయింది. చంద్రోదయ మయింది. ఆఖరికి భవనం వెనుక ద్వారం గుండా గుర్రం పై పీష్వారావడం చూసి దళనాయకుడు ఆనం దంతో, ''ఆగు!'' అంటూ తుపాకీని గురి పెట్టాడు. నానా కిందికి దూకి వేగంగా పరిగెత్త సాగాడు. దళనాయకుడు పేల్చిన తుపాకీ గుళ్ళు, అతడి భటులు కొందరిని గాయపరిచాయి.

''అతణ్ణి పట్టుకోండి! బహుమతి అందు కోండి!'' అని దళనాయకుడు అరిచాడు.

ఆఖరికి అతని వెంట పరిగెత్తిన ఒక వ్యక్తి అతణ్ణి ఎలాగో పట్టుకుని తెచ్చి దళనాయకు డికి అప్పగించాడు. పరమానందం చెందిన దళనాయకుడు అతణ్ణి ఖైదు చేసి గదిలో బంధించాడు. పట్టిచ్చిన వ్యక్తి, ''నా బహుమతి ఎక్కడ?'' అని అడిగాడు.

''ఉదయం రా, ఇస్తాను,'' అన్నాడు దళ నాయకుడు.

అయితే, తెల్లవారాక కూడా ఆ వ్యక్తిరాలేదు. ఆ తరవాత పట్టుబడిన వ్యక్తి నానాసాహెబ్ కాదనీ, ప్రముఖుడి అల్లుడనీ తెలిసి అతణ్ణి గౌరవంగా విడిచి పెట్టారు. అతణ్ణి పట్టి తెచ్చిన వ్యక్తి అసలైన నానాసాహెబ్! ఆయన తప్పిం చుకోవడానికి వేసిన పథకంలో ఆ ఇంటి అల్లుడు ఆయనకు తెలివిగా సహకరించాడన్న మాట!

నానాసాహెబ్‌ను పట్టుకోవాలన్న ప్రయత్నంలో అధికారులు అనుమానితులందరినీ పట్టి బంధించసాగారు. తిరుగు బాటు జరిగిన ముప్పై యేడేళ్ళ తరవాత చివరగా వాళ్ళొకసన్యాసిని పట్టుకు న్నారు. అధికారి, ''నానా సాహెబ్‌ను ఖైదు చేశాం. ఏం చేయమన్నారు?'' అని అధిష్ఠానానికి టెలిగ్రాం



ఇచ్చాడు. ''వెంటనే అతణ్ణి వదిలి పెట్టు,'' అంటూ సమాధానం వచ్చింది.

రష్యన్ సైన్యంతో నానా ఇండియాపై దాడిచేయ గలడని వదంతులు రావడంతో బ్రిటిష్ అధికారులు హడలిపోయారు. నానాసాహెబ్ అడవిలో పులికి ఆహారమై పోయాడని మరి కొందరు చెప్పుకున్నారు. అయితే నేపాల్‌లో ఆయన భార్య ఒంటరిగా నివసిస్తూండేది. ఆమె వితంతువులా బట్టలు ధరించడానికి నిరాకరించడంతో నానాసాహెబ్ ఆమెను రహస్యంగా వచ్చి చూసి వెళుతూన్నట్టు ప్రజలు భావించసాగారు.

పెర్సివాల్ లాండన్, ''నానాసాహెబ్ మరణించిన తారీఖు, విధానం ఆసియా చరిత్రలో ఎన్నటికీ పరిష్కరించలేని మర్మాలలో ఒకటిగా నిలిచి ఉంటుంది,'' అని రాశాడు.

పలువురు ఇంగ్లీషు రచయితలు, చరిత్రకారులు నానాసాహెబ్ జీవితం పట్ల ఆకర్షితులయ్యారు. చాలామంది తమరచనల్లో అతణ్ణి ప్రతినాయకుడిగానే చిత్రించారు. జూల్స్ వెర్న్ రచించిన నవలలో కథానాయకుడైన నానా సన్యాసిగా ఇండియాకు తిరిగి వస్తాడు. ఆయన పండు ముదుసలి అయ్యేవరకు జీవించాడనే పలువురు అభిప్రాయపడుతున్నారు. కొందరు చూసినట్టు కూడా చెప్పారు.

చాలా దూరం పయనించిన ఒక బాటసారి హిమాలయాల పాదతలంలోని ఒక చిన్నమేడ దగ్గర విశ్రాంతి తీసుకుంటున్నాడు. చాలా చలిగా ఉండడంతో చలిమంటవేశాడు. ఉన్నట్టుండి తెల్లటి గడ్డంతో, మెరిసే కళ్ళతో ఒక వృద్ధుడు అక్కడికి వచ్చాడు. ఆయన సిపాయిల తిరుగుబాటు గురించి ఎంతో ఉత్సాహంతో వివరించసాగాడు. అంతా విన్న బాటసారి ఆఖరికి, ''అవునూ, ఇవన్నీ నీకు ఎలా తెలుసు?'' అని అడిగాడు ఆశ్చర్యంగా.

''ఎలా తెలియడమేమిటి? అవన్నీ నా ద్వారానే జరిగాయి. నానాసాహెబ్‌ను గురించి నువ్వు వినలేదా?'' అన్నాడు వృద్ధుడు.

బాటసారి ఆశ్చర్యం నుంచి తేరుకునేలోగా అతడు చీకట్లో కలిసిపోయాడు.

బహుశా నేపాల్ అడవుల నుంచి ఆయన బ్రిటిష్ వారికి రాసిన చివరి ఉత్తరం ఇలా సాగుతుంది: ''భారత దేశాన్ని ఆక్రమించుకుని, పరిపాలించడానికి మీకు ఎవరు అధికారమిచ్చారు? నన్ను నా మాతృభూమి నుంచి బహిష్కరించడానికి మీరెవ్వరు? ఏమిటీ? దుర్మార్గం! పరంగివారైన మీరు రాజులు? మా సొంత దేశంలోనే మేము దొంగలమా?''

-(ఎకెడి)








## ప్రాచీన వీరోచిత క్రీడ

సంక్రాంతి పండుగ సందర్భంగా తమిళనాడు లోని కొన్ని ప్రాంతాలలో 'జల్లికట్టు' అనే ఆబోతులను లొంగదీసే పందాలను నిర్వహిస్తారు. దీనిని అభిమానించి ప్రోత్సహించేవారు-ఇది 3,500 నాటి ప్రాచీన సాహస క్రీడ అని చెబుతారు. తమిళనాడు నీలగిరి జిల్లా కరిక్కియూర్ గ్రామం గుహకుడ్యచిత్రాలను అందుకు సాక్ష్యాధారాలుగా పేర్కొంటారు. దాదాపు 500 చిత్రాలు గల ఈ గ్రామంలోనే దక్షిణ భారతదేశంలో ఎక్కువ కుడ్యచిత్రాలుగల గుహలు ఉన్నాయి. ఈ చిత్రాలలో పొడవాటి కొమ్ములు, నూపురాలు గల ఎడ్లను యువకులు తరిమి లొంగదీసుకునే దృశ్యాలు చిత్రంచబడి ఉన్నాయి.

## 'కనిపించని' విగ్రహం గల ఆలయం

కేరళలోని త్రిసూరులోని వడక్కునాథన్ శివాలయం తెన్ (దక్షిణ) కైలాసంగా పిలువబడుతోంది. విష్ణువు దశావతారాలలో ఆరవవాడైన పరశురాముడు దీనిని తొలుత నిర్మించాడని స్థలపురాణం పేర్కొంటున్నది. ఆదిశంకరుల తల్లిదండ్రులు చాలాకాలం సంతానానికి నోచుకోలేదనీ, ఈ ఆలయంలోని శివుణ్ణి పూజించాక మగబిడ్డ పుట్టాడనీ అందుకే అతనికి శంకరుడని నామ కరణం చేశారనీ చెబుతారు. ఇక్కడి ప్రధాన విగ్రహం భక్తులు చేసే నెయ్యి అభిషేకం కారణంగా పన్నెండు అడుగుల నేతి ముద్దలో కూరుకుపోయి కనిపించకుండా ఉంటుంది. వేసవి కాలంలో సైతం ఇది కరిగిపోకుండా ఉండడం ఓ వింత విశేషం.





# పెరట్లో పెంచుకున్న అడవి!

అమృతాదేవి వేకువ జామున నాలుగున్నరకే లేచి గాఢంగా నిట్టూర్చింది. బయట ఎముకలు కొరికే చలి. కటిక చీకటి. వంటచెరకు తెచ్చుకోవడానికి ఇరవై కి.మీ. దూరం వెళ్ళి రావాలి. ఈ పనిని ఆమె గత ఇరవై సంవత్సరాలుగా చేస్తోంది. పదహారేళ్ళ వయసు నుంచి మొదట పుట్టింట, ఇప్పుడు పెళ్ళాయ్యాక మెట్టినింట. అయితే, రోజు రోజుకూ అడవి గ్రామం నుంచి దూరమవుతూండడంతో ఆమె మరింత ఎక్కువ దూరం వెళ్ళి రావలసి ఉంటోంది.

ఆమె హిమాలయాల గర్వాల్ ప్రాంతంలో మక్కూ అనే గ్రామంలో నివసిస్తోంది. వానాకాలమయినా, ఎండాకాలమయినా, శీతాకాలమైనా ప్రతి ఉదయం ఆమెలాగే అడవికి వెళ్ళి వచ్చే స్త్రీలు ఆ ప్రాంతంలో వేలాది మంది ఉన్నారు.

ఆ ప్రాంతంలోని గ్రామస్థులు తమ పలు అవసరాలకు అడవుల మీదే ఆధారపడతారు. ప్రతి రోజూ అవసరమయ్యే వంట చెరకు, ఇళ్ళ నిర్మాణానికి కావలసిన కలప, మందు మాకులకు ఉపయోగపడే మూలికలు మొదలైనవాటిని అడవి నుంచే తెచ్చుకుంటారు. తమ గొర్రెలను కూడా ఇక్కడి అడవి ప్రాంతంలోనే స్త్రీలు మేపుతూంటారు. అడవి తల్లి ఆదరణ లేకుండా అక్కడి ప్రజల జీవితం గడవడం అసాధ్యం!

అమృతాదేవి మరో పదిహేను మంది స్త్రీలతో కలిసి అడవి కేసి నడవసాగింది. అందరి మనసుల్లోనూ ఆరోజు చేయవలసిన పనుల గురించే ఆలోచనలు. అడవికెళ్ళి కట్టెలు తేవడానికి కనీసం నాలుగు గంటలు సరిపోతుంది. వచ్చీ రాగానే వంట చేసి పిల్లల్ని లేపి వాళ్ళకింత పెట్టి బడికి పంపాలి. ఆ తరవాత పొలం పనులలో భర్తలకు సాయపడి, గొర్రెలను అడివికి తోలుకుపోయి మేపుకు రావాలి. పొద్దస్తమానం బండచాకిరీ తప్పదు!

అమృతాదేవి ఉన్నట్టుండి, ''ఈ బండ చాకిరీ నుంచి బయటపడి కాస్త సులభంగా బతకడానికి ఏదైనా మార్గం ఉందా? గ్రామం సమీపంలో కొంత అడవి ప్రాంతం ఉంటే

మన శ్రమ చాలామటుకు తగ్గిపోతుంది. అంతే కాదు. మనమా అడవిని కాపాడుకుంటూ దాని నుంచి ఎన్నో ప్రయోజనాలు పొందవచ్చు,'' అన్నది.

ఆమె మాటలు అందరినీ ఒకే విషయం గురించి ఆలోచించేలా చేసింది. ''వేకువ జామునే లేచి ఇంత దూరం నడిచే పని లేకుండా వుంటే ఎంత బావుణ్ణు!'' అయినా అదెలా సాధ్యం? అప్పటికే వన్ పంచాయత్ అడవులు ఉన్నాయి గనక, దాని కోసం గ్రామ పెద్దలను కూడా అడగలేరు.

దాదాపు డెబ్భై సంవత్సరాలకు పూర్వం ఇక్కడి గ్రామస్థులు ఇంగ్లీషు వారితో పోరాడి తమకంటూ సొంత అడవులు పొందడానికి వారిని ఒప్పించగలిగారు. అలాంటి అడవులను వన్ పంచాయత్ అడవులు అంటారు. వాటిని ఈనాటికీ స్థానికులే నిర్వహిస్తున్నారు. ఈ ప్రాంతంలోని తక్కిన అడవులన్నీ ఆటవిక శాఖ యాజమాన్యం కిందికి వస్తాయి. తమ అవసరాలు తీర్చుకోడానికి వాటిని వినియోగించడానికి గ్రామస్థులను అనుమతించరు. అయితే, వన్ పంచాయత్ అడవులు కూడా అన్ని చోట్లా గ్రామాలకు సమీపంలో లేవు. అన్నిటి కన్నా ముఖ్య విషయం ఏమిటంటే ఈ అడవులను ఎలా ఉపయోగించుకోవాలన్నది ఆ గ్రామంలోని పురుషులే నిర్ణయిస్తారు. స్త్రీలకు ఇది చాలా అన్యాయంగా అనిపించింది. అడవికి సంబంధించిన పనులన్నీ చేస్తున్నప్పటికీ, దానిని ఎలా ఉపయోగించుకోవాలి అన్న విషయాన్ని నిర్ణయించడంలో మాత్రం స్త్రీలకు ఎలాంటి ప్రాముఖ్యతా లేదు!

దీనికేదైనా ఒక పరిష్కారం చూడాలనుకున్నారు. ఆ తరవాత జరిగే మహిళా మంగళ్‌దళ్ సమావేశంలో చర్చించాలనుకున్నారు. ఆ రోజు సాయంకాలమే ఏర్పాటు చేసిన సమావేశంలో గ్రామానికి చెందిన దాదాపు యాభై మంది మహిళలు పాల్గొన్నారు. ఇన్నేళ్ళుగా దూరంలోని అడవికి వెళ్ళి వంటచెరుకు తెచ్చుకుంటున్నాం కదా! మరి ఇప్పుడేం ముంచుకొచ్చింది? దాన్ని అలాగే కొనసాగించడమే మంచిదని కొందరు వృద్ధ మహిళలు అభిప్రాయపడ్డారు. అయితే, యువతులు దానిని తీవ్రంగా ఖండించారు. ఆఖరికి ఈ విషయంగా వనపంచాయత్ అధ్యక్షుడు మైథానీజీతో మాట్లాడాలని ఎక్కువమంది నిర్ణయించారు.

మైథానీజీ మంచి చెడ్డలు ఆలోచించగల పెద్దమనిషి. ఆయన స్త్రీలకు తన సానుభూతిని తెలియజేసి ఈ విషయం గురించి ఆలోచిస్తానని చెప్పాడు. కొన్ని రోజుల తరవాత ఒక సూచనతో వచ్చాడు. ఊరికి సమీపంలో బంజరు భూమి చాలా ఉన్నది. అక్కడి చెట్లు ఎప్పుడో నరికివేయబడ్డాయి. ఆ తరవాత అక్కడ అంతగా చెట్టూ చేమా బతకలేదు. కావాలంటే స్త్రీలు అక్కడ మొక్కల రక్షణా బాధ్యతను కూడా చేపట్టినట్టయితే కొన్నేళ్ళకు అక్కడ చక్కటి

అడవి ఏర్పడుతుంది. వాటిని స్త్రీలు ప్రత్యేకంగా తమ ఇంటి అవసరాలకు ఉపయోగించుకోవచ్చునని ఆయన సూచించాడు.

మహిళా మంగళ్ దళ్ మళ్ళీ సమావేశమయింది. పలువురు స్త్రీలు ఆఖరికి తమ కల నిజం కాబోతోందని ఆనందంతో ఉప్పొంగిపోయారు. మరికొందరేమో, ''స్త్రీలు ఎలా అడవులను పరిరక్షించగలరు?'' ''ఇప్పటికే ఆడవాళ్ళు చేయవలసిన పనులు తలకు మించి ఉన్నాయి కదా?'' ''అయినా, అందుకు వాళ్ళ భర్తలు ఒప్పుకుంటారా?'' అంటూ అనుమానాలతో పెదవి విరిచారు. ఇంకా కొందరయితే వెనుదిరిగి వెళ్ళిపోయారు.

అయితే, చాలా మంది స్త్రీలు దీన్నొక సవాలుగా తీసుకుని కార్య రంగంలోకి ఉరికారు. వాళ్ళ దగ్గర డబ్బులు లేవు. అడవికి కాపలా కాయడానికి వన్ పంచాయత్‌లాగా జీతాలకు మనుషులను ఏర్పాటుచేయలేరు. తామే స్వయంగా పగటిపూట ఇద్దరు, రాత్రి పూట ఇద్దరు తమ అడవికి కాపలా కాయాలని నిర్ణయించారు.

అయినా వాళ్ళు అనుకున్నంత సులభంగా పనులు జరగలేదు. చాలా మందికి ఇళ్ళ నుంచే వ్యతిరేకత ఎదురయింది. కాపలాకు వెళతానన్న భార్యలను కొందరు భర్తలు వదిలేశారు కూడా. స్త్రీలు ఇంటిపట్టున లేనప్పుడు ఇంటి పనులు చేయడానికి పురుషులు ఇష్టపడలేదు. అయినప్పటికీ స్త్రీలు తమ పట్టుదలను వదిలిపెట్టలేదు. కాపలా కాయడానికి ఒక పథకాన్ని రూపొందించారు. హద్దు మీరి అడవిలో ప్రవేశించేవారికి జరిమానా విధించే విధానాన్ని ప్రవేశపెట్టారు.

క్రమ క్రమంగా కొత్త కొత్త మొక్కలు పుట్టుకు రాసాగాయి. పెరిగి పెద్దవి కాసాగాయి. కొన్ని సంవత్సరాలలో స్త్రీల కృషి ఫలించింది. ఎందుకూ పనికిరాని ఒకనాటి బంజరు నేల ఈనాడు దట్టమైన చెట్టు చేమలతో పచ్చదనం సంతరించుకున్నది. స్త్రీలు అక్కడి నుంచే వంటచెరకును సేకరించసాగారు. అడవి నుంచి ఎప్పుడెప్పుడు ఎంతెంత తీసుకోవచ్చునన్నడానికి నియమ నిబంధనలు తమకు తామే ఏర్పరచుకుని అమలు పరిచారు.

ఇవాళ అమృతాదేవి, ఆమె గ్రామంలోని స్త్రీలు వేకువ జామున నాలుగున్నరకే లేచి అడవికేసి చాలా దూరం నడవవలసిన అవసరం లేదు. అచంచలమైన పట్టుదలతో, శ్రమతో తమకు కావలసిన అడవిని తమ సొంత పెరట్లోనే పెంచుకున్నారు! -సీసూఫల్





# దానహీనుడు

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో బోధిసత్వుడు ఆయన వద్ద కోశాధికారిగా జన్మించాడు. ఆయన ఎనభై కోట్లకు అధిపతి అయి ఉండి కూడా, ప్రపంచంమీద వైరాగ్యం కలిగి, తన ధనాన్ని రాజుగారిని స్వీకరించమని కోరాడు.

''నాకు ధనలోపం ఏమీ లేదు. అందు చేత నీ ధనాన్ని మరొక విధంగా వినియోగించుకో!'' అని రాజు జవాబిచ్చాడు. అప్పుడు కోశాధికారి రాజుగారి అనుమతితో కాశీ నగరంలో ఆరు అన్నసత్రాలు ఏర్పాటు చేశాడు. ఈ సత్రాలలో భారీగా దానధర్మాలు జరుగుతూ వచ్చాయి. ప్రతిరోజూ ఒక్కొక్క లక్ష చొప్పున ఖర్చు అవుతూండేది.

ఈ అన్నసత్రాలు ఏర్పాటు చేసిన ఫలితంగా కోశాధికారి చనిపోయిన అనంతరం స్వర్గంలో ఇంద్రపదవి సంపాదించాడు. ఆయన కుమారుడు తండ్రి అడుగుజాడల లోనే నడిచి చనిపోయి చంద్రుడుగా పుట్టాడు. చంద్రుడి కొడుకు సూర్యుడుగా పుట్టాడు. సూర్యుడి కొడుకు మాతలిగానూ, మాతలి కొడుకు పంచ శిఖాగ్నిగానూ పుట్టి దేవత్వం సంపాదించుకున్నారు.

కాని పంచశిఖుడి కుమారుడి వద్దకు వచ్చే సరికి వంశాచారం నిర్మూలమై పోయింది. ఎందుచేతనంటే పంచశిఖుడి కొడుకు ఎనభై కోట్లకు అధిపతి అయినప్పటికీ పరమలోభి. అతణ్ణి ప్రజలు మచ్ఛరికోశియుడని పిలిచేవారు. తన తండ్రి పోగానే అతను అన్నసత్రాలన్నీ మూయించి, భవనాలను తగలబెట్టి నేలమట్టం చేయించాడు.

అన్నసత్రాలు మూయగానే నగరం లోని బీదా బిక్కి జనం మచ్ఛరికోశియుడి ఇంటి ముందు మూగి, ''బాబూ, ధర్మం మానకండి!

జాతక కథ

సత్రాలు మూయకండి!'' అని ఆక్రోశించారు. మచ్ఛరికోశియుడు మనుషులను పెట్టి ఈ పేదవాళ్ళందరినీ తన ఇంటి ముందునుంచి గెంటించాడు.

మచ్ఛరికోశియుడు కోటీశ్వరుడు. తన తాత తండ్రులలాగే రాజుగారి వద్ద కోశాధి కారిగా పని చేస్తున్నాడు. కాని ఆయన తన డబ్బుతో ఎన్నడూ సుఖం అనుభవించి ఎరగడు. తాను కడుపునిండా తిని ఎరగడు సరికదా, తన భార్యాబిడ్డలను కూడా తిన నిచ్చేవాడుకాడు. ఆయన గొడ్డుకారం మెతు కులు తిని పులిమజ్జిగ తాగేవాడు. కటిక దరిద్రుడిలా నారబట్టలు కట్టుకునేవాడు. ఇరుసులు అరిగిపోయిన పాతబండికి బక్క చిక్కిన ఎద్దులు కట్టి, ఆ బండి మీద ఎక్కడి కైనా వెళుతుండేవాడు.

ఒకనాడు ఈ పిసినిగొట్టు రాజసభకు పోతూ, ఉపకోశాధిపతిని కూడా వెంట బెట్టుకు పోదామని వారి ఇంటికి వెళ్ళాడు. సరిగ్గా ఆ సమయానికి ఉపకోశాధిపతీ, ఆయన భార్యా, పిల్లలూ విస్తళ్ళముందు కూచుని చక్కెరపొంగలి తింటున్నారు. కోశాధికారిని చూడగానే ఉపకోశాధిపతి లేచి, ఆయనను కూడా చక్కెరపొంగలి తినటానికి రమ్మని ఆహ్వానించాడు.

''ఇప్పుడు నేను వీడి ఆతిథ్యం స్వీకరించి ఈ చక్కెరపొంగలి తింటే, రేపు నేను వీడి ఇంటిల్లిపాదినీ పిలిచి విందు చేయవలసి ఉంటుంది!'' అని భయపడి మచ్ఛరికోశి యుడు, ''నాకు ఆకలి లేదు. నేనింతకు



ముందే కడుపు నిండా తిని వచ్చాను, మీరు కానివ్వండి!'' అన్నాడు.

కాని ఆ క్షణంనుంచే మచ్ఛరికోశియుడికి చక్కెరపొంగలి తినాలని తీవ్రమైన కోరికపట్టు కున్నది. కాని ఇంట్లో వండిస్తే తనతోబాటు ఇంకా చాలామంది తింటారు. అందుచేత ఆయన తన కోరికను ఎవరిదగ్గిరా బయట పెట్టక, మనోవ్యాధితో మంచం పట్టాడు.

ఆయన భార్య వచ్చి, ''మీకు వంట్లో జబ్బుగా ఉందా?'' అని అడిగింది. ''నీకే మైనా జబ్బేమో, నేను బాగానే ఉన్నాను!'' అన్నాడాయన. కాని భార్య వదిలిపెట్టక అసలు సంగతి తెలుసుకున్నది. అంతా విని ఆమె, ''మనమేం దరిద్రులమా? చక్కెర పొంగలి కోసం మనోవ్యాధి పడాలా? కాశీ నగరంలో ఉన్న జనాభాకంతకీ చక్కెరపొంగలి వండిస్తాను!'' అన్నది.



''మీ పుట్టింటివాళ్ళు చాలా భాగ్యవంతులని నాకు తెలుసులే. అక్కడి నుంచి తవ్వి తెచ్చి ఊరంతకీ చక్కెరపొంగలి సంతర్పణ చెయ్యి!'' అన్నాడు పిసినిగొట్టు. కనీసం వీధిలోవాళ్ళందరినీ పిలుద్దామన్నది భార్య. వాళ్ళందరితోటీ నీకేమిటన్నాడు భర్త. అయితే కనీసం మనింటిల్లిపాదికీ చక్కెరపొంగలి వండుతానన్నది భార్య. భర్త ఏమాత్రం వీల్లేదన్నాడు. ''సరే అయితే మీకూ, నాకూ వండుతాను,'' అన్నది భార్య.

''మధ్యనువ్వుదేనికి?'' అన్నాడు భర్త చిరాగ్గా.

''అయితే మీ ఒక్కరికోసమే వండుతాను. సరా?'' అన్నది భార్య.

''అసలు ఇంట్లో వండటానికి వీల్లేదు. ఇంత బియ్యమూ, పాలూ, నెయ్యూ, తేనే నా చేతికియ్యి. వంటపాత్రలు కూడా ఇయ్యి. నేను అడివిలోకి వెళ్ళి చక్కెరపొంగలి వండుకుని తింటాను!'' అన్నాడు భర్త.

భార్య ఆయనకు కావలసిన వస్తువులన్నీ ఇచ్చింది. వాటిని ఒక బానిసవాడి చేత మోయించుకుని మచ్ఛరికోశియుడు ముసుగు కప్పుకుని, నదీ తీరం వెంబడి ఉండే అరణ్యానికి వెళ్ళాడు. నదీతీరాన ఒక పొద పక్కన పొయ్యి ఏర్పాటు చేసి తన నౌకరుచేత వంట కట్టెలూ, నీరూ తెప్పించి, వాణ్ణి వెళ్ళి రహదారి మీద నిలబడమన్నాడు. ''ఎవరన్నా దారి వెంట వస్తుంటే నాకు తెలియజెయ్యి. నీతో నాకు పని ఉంటే కేకవేస్తాను. నేను పిలిస్తే గాని రాకు!'' అని వాడితో చెప్పాడు.

ఈలోపల ఇంద్రుడు తన ఆరవ తరం వాడైన మచ్ఛరికోశియుణ్ణి గురించి తెలుసుకున్నాడు. ''పంచశిఖుడి దాకా అందరూ దానధర్మాలు చేసి దేవత్వం పొందితే, పంచశిఖుడి కొడుకు పిసినిగొట్టయి, వంశాచారాన్ని మంటకలిపి, చక్కెరపొంగలి తాను ఒక్కడే తినగలందులకై అడవిలోకి వచ్చి వంట చేసుకుంటున్నాడు. ఇప్పటికైనా నేను వీడికి జ్ఞానోదయం కలిగించకపోతే వీడు నరకానికి పోతాడు!'' అనుకుని ఇంద్రుడు చంద్రుణ్ణీ, సూర్యుణ్ణీ, మాతలినీ, పంచశిఖుణ్ణీ పిలిపించి వారితో తాను చేయదలచిన పనిని గురించి చెప్పాడు.

తరవాత ఇంద్రుడు బ్రాహ్మణ వేషం ధరించి మచ్ఛరికోశియుడు వంట చేసుకునే చోటికి వెళ్ళి, ''ఇదిగో, కాశీకి దారి ఎటు?'' అని అడిగాడు.

''కాశీకి దారే తెలియదూ? ఇటుకేసి వస్తున్నావేమిటి? పో అవతలికి!'' అని మచ్ఛరి కోశియుడు కేకలు పెట్టాడు.

''ఎందుకలా అరుస్తున్నావు? చక్కెర పొంగలి చేస్తున్నావే? బ్రాహ్మణ సంతర్పణ చేస్తున్నావు కాబోలు. వాళ్ళతో పాటు నేను కూడా పంక్తిని కూచుంటాను!'' అన్నాడు ఇంద్రుడు నవ్వుతూ.

''సంతర్పణా లేదు, గింతర్పణా లేదు! పద, పద!'' అని మచ్ఛరికోశియుడు అతణ్ణి అదిలించాడు.

''ఎందుకు నాయనా, అంత కోపగించు కుంటావు. అభ్యాగతిని, నీతోబాటు ఆ వండినదేదో ఇంత పెడితే పుణ్యమే గాని పాపం రాదే!'' అన్నాడు ఇంద్రుడు.

''నేను నీకు ఒక్క మెతుకు కూడా పెట్టను. ఇది నాకే చాలదు. నేనే ముష్టెత్తి తెచ్చుకు న్నాను. అందులో మళ్ళీ నీకు ముష్టా? అదేం కుదరదు!'' అన్నాడు మచ్ఛరికోశియుడు.

''కొంచెంలో కొంచెమే దానం చెయ్యి. ఎక్కువ ఉంటే ఎక్కువ దానం చెయ్యి. ఒంటిగా ఎన్నడూ తినరాదు. దానంవల్ల ఉత్తమ లోకాలు కలుగుతాయి!'' అని ఇంద్రుడు బోధ చేశాడు. చిట్టచివరకు మచ్ఛరికోశి యుడు, ''సరే, అలా కూచో, నీక్కూడా కొంచెంగా చక్కెరపొంగలి పెడతాను!'' అన్నాడు.

ఇంతలో చంద్రుడు కూడా బ్రాహ్మణ వేషం ధరించి వచ్చి చక్కెరపొంగలి యాచిం చాడు. అతణ్ణీ కూచోమనక మచ్ఛరికోశియు డికి తప్పలేదు. తరవాత సూర్యుడూ, మాతలీ,



పంచశిఖుడు కూడా బ్రాహ్మణ వేషాలలో వచ్చి పక్కనే తిష్ఠవేశారు.

త్వరలోనే చక్కెరపొంగలి తయారయింది. ''వడ్డిస్తాను, ఆకులు తెచ్చుకోండి!'' అన్నాడు మచ్ఛరికోశియుడు. బ్రాహ్మణులు చేతులు చాచేసరికి వారి చేతుల్లోకి పెద్ద పెద్ద బండి చక్రాలంత తామరాకులు వచ్చాయి.

''ఇంతంత పెద్ద ఆకుల్లో నేను వడ్డించను. మందార పత్రాలలాటివి తెచ్చుకోండి!'' అన్నాడు మచ్ఛరికోశియుడు. వాళ్ళు మందార పత్రాలు తెచ్చుకున్నా, అవి పెద్ద అరటి ఆకుల ప్రమాణంలో ఉన్నాయి. మచ్ఛరికోశి యుడు చక్కెరపొంగలి వడ్డించాడు. వారం దరికీ పెట్టినా పాత్రలో ఇంకా చాలా చక్కెర పొంగలి మిగిలిపోయింది.

ఇంతలో పంచశిఖుడు కుక్క రూపం ధరించి ఆ పాత్రలో మూతి పెట్టబోయాడు.

సమయానికి మచ్ఛరికోశియుడు పాత్రకు తన చేతులు అడ్డం పెట్టాడు. కాని ఆయన చేతులకు కుక్క ఎంగిలి తగిలింది.

''నేను చెయ్యి కడుక్కోవటానికి కాసిని నీళ్ళు తెచ్చి పెట్టండి!'' అని ఆయన బ్రాహ్మణులను కోరాడు. వారు నిర్మొహమాటంగా, ''మేము తీసుకురాము!'' అని చెప్పారు.

''నా చక్కెరపొంగలి తింటూ ఆమాత్రమైనా విశ్వాసం లేదా?'' అని మచ్ఛరికోశియుడు వారిని అడిగాడు. వారు ససేమిరా తీసుకురామన్నారు. ''అయితే నా పాత్రను కాస్త చూస్తూ వుండండి. నేనే వెళ్ళి నీళ్ళు తెచ్చుకుంటాను!'' అంటూ మచ్ఛరికోశియుడు నదివద్దకు దిగి వెళ్ళసాగాడు. వెంటనే కుక్క చక్కెరపొంగలి పాత్రలో మూతి పెట్టేసింది.

మచ్ఛరికోశియుడికి కోపం వచ్చి, ఒక కర్ర తీసుకుని కుక్క వెంట పడ్డాడు. అయితే ఆ కుక్క అంతలోనే గుర్రం ఆకారం ధరించి మచ్ఛరికోశియుణ్ణే తరమ సాగింది. అది క్షణక్షణానికీ రంగులు మారుతూ, కాస్సేపు చిన్నదవుతూ, కాస్సేపు పెద్దదవుతూ కనపడింది. మచ్ఛరికోశియుడు ప్రాణభీతితో గిజగిజలాడాడు. అతడు బ్రాహ్మణులను, ''బాబూ, నన్ను ఈ గుర్రం బారినుంచి రక్షించండి!'' అని కోరాడు.

వెంటనే ఆ అయిదుగురూ తమ నిజ స్వరూపాలతో గాలిలోకి లేచి నిలబడ్డారు. ''మీరు మనుషులు కారు, దేవతలు! మీ పేర్లేమిటో, ఎందుకు దయచేశారో చెప్పండి!'' అన్నాడు మచ్ఛరికోశియుడు.

''మేము నీ పితృదేవతలం. మానవజన్మ ఎత్తి దానాలు చేసిన ఫలితంగా దేవత్వం సంపాదించుకున్నాం. నువ్వు లోభివై, వంశాచారాన్ని మంట గలిపి నరకం సంపాదించుకుంటున్నావు. నీకు గుణపాఠం చెప్పే నిమిత్తమై వచ్చాం! ఇంటికి పోయి దానధర్మాలు చేసి మాలాగే దేవత్వం సంపాదించుకో!'' అన్నాడు ఇంద్రుడు.

మచ్ఛరికోశియుడి బుద్ధి మారిపోయింది. ఆయన ఇంటికి వెళ్ళి తన ధనమంతా పేదలకు దానం చేసి, తపస్సు చేసుకోవటానికి హిమాలయాలకు వెళ్ళిపోయాడు.





# రామాయణం

శింశుపా వృక్షం ఎక్కిన హనుమంతుడు అక్కడి నుంచి చుట్టుపక్కలన్నీ కలయ జూశాడు. అశోకవనం దేవేంద్రుడి నందన వనం లాగుంది. దాని నిండా పూల చెట్లూ, పళ్ళ చెట్లూ ఉన్నాయి. పక్షులూ, మృగాలూ ఉన్నాయి. అక్కడక్కడా దివ్యమైన భవనాలూ, అరుగులూ; తామర పూలూ, కలువపూలూ గల మడుగులున్నాయి. అన్నిటికన్న అశోక వృక్షాలు జాస్తిగా ఉన్నాయి.

కొద్ది దూరంలో ఒక ఎత్తయిన తెల్లని మండపం ప్రకాశిస్తున్నది. అందులో వెయ్యి స్తంభాలున్నాయి. దానిలో పగడాలతో తయారు చేసినమెట్లూ, బంగారు అరుగులూ ఉన్నాయి. అది ఒక చైత్యం ఆకారంలో ఉన్నది. తరవాత హనుమంతుడికి సీత కనిపించింది. ఆమె ధరించిన చీర మట్టి కొట్టుకుని ఉన్నది. ఆమె చుట్టూ రాక్షస స్త్రీలున్నారు. ఆమె బాగా కృశించి, నిట్టూర్పులు విడుస్తూ, దైన్యంతో కూడుకుని ఉన్నది. దేహ సంస్కారం లేక ఆమె శరీరం కూడా మట్టి కొట్టుకుని ఉన్నది. నగలు చాలా కొద్దిగా ఉన్నాయి. ఆమె జుట్టు ఒకే జడలాగా అట్టకట్టుకుపోయి తుంటి దాకా వేళ్ళాడుతున్నది.

ఈమె సీత అయి ఉండాలని హనుమంతుడు ఈ విధంగా వితర్కించుకున్నాడు: రావణాసురుడు ఎత్తుకు పోయేటప్పుడు ఆ స్త్రీలో తనకూ, సుగ్రీవాదులకూ కనిపించిన పోలికలు ఈమెలో కొన్ని ఉన్నాయి. నిండు చంద్రుడి వంటి ముఖం. తీర్చినట్టుండే కనుబొమలు, నల్లని వెంట్రుకలు, అందమైన

సుందరకాండ – 3



ఒకటి గానే ఉన్నాయి-కాకపోతే చీర చాలా మాసి ఉన్నది. ఇవన్నీ ఆలోచించి హనుమంతుడు ఆమె సీతేనని నిశ్చయించుకుని పరమానందం చెందాడు.

మరుక్షణమే సీత స్థితి తలుచుకుని హనుమంతుడి గుండె నీరైపోయింది. జనకుడి కుమార్తె, దశరథుడి పెద్ద కోడలు, ఎన్నో సుఖాలు అనుభవించ వలసిన ఈ సీత కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తూ, శుష్కించి, ఈ భయంకర రాక్షస స్త్రీల మధ్య ఇలా కుమిలిపోవట మేమిటి? ఈ సీత కోసం రాముడు ఎందరు రాక్షసులను చంపాడు! ఈమె కోసమే గదా అతను వాలిని చంపి సుగ్రీవుడికి పట్టం గట్టాడు! ఈమెకోసమే గదా తాను సముద్రాన్ని లంఘించి లంకకు వచ్చాడు! ఈమె కోసం రాముడు మూడు లోకాలూ తల్లకిందులు చెయ్యమన్నా చేస్తాడు. "పరాయి వాణ్ణయిన నాకే ఈ సీతను చూసి ఇంత బాధ కలుగుతూంటే రాముడి కింకా ఎంత దుఃఖం కలుగుతూండవచ్చు?" అనుకున్నాడు హనుమంతుడు.

రాత్రి చాలా భాగం గడిచింది. రాక్షస బ్రాహ్మణులు వేదాధ్యయనం ప్రారంభించారు. మంగళ వాద్యాలు మోగాయి. రావణుడు వాటి ధ్వనికి మేలుకొని, సీతను జ్ఞాపకం తెచ్చుకున్నాడు. వెంటనే అతను సమస్తాభరణాలూ ధరించి, వెలిగి పోతూ అశోక వనానికి బయలుదేరాడు. అతని వెంట నూరు మంది స్త్రీలు వచ్చారు. వారిలో కొందరు బంగారు దీపస్తంభాలూ, కొందరు చామ

నడుము-సీత ఎంత కృశించి, శోక సముద్రంలో మునిగి ఉన్నా ఈ లక్షణాలు దాగటం లేదు. ఇవి గాక రాముడు సీత గుర్తులు కొన్ని చెప్పాడు. అందుచేత హనుమంతుడు ఆమె సీతేనని నిర్ణయించుకోవటానికి చాలా శ్రద్ధగా చూశాడు.

రాముడు చెప్పిన ఆభరణాలలో కొన్నిటిని ధరించటం ఇష్టంలేక ఆమె చెట్టు కొమ్మలకు తగిలించింది. వాటిలో చెవులకు పెట్టుకునేవీ, చేతులకు పెట్టుకునేవీ ఉన్నాయి. అవి తీసి వేసినట్టుగా సీత చెవులకూ, చేతులకూ గుర్తులు కానవస్తున్నాయి. అదీ గాక సీత ఋశ్యమూక పర్వతం పైన మూట గట్టి పడవేసిన ఆభరణాలలో ఇవి లేవు. అదీ గాక సీత నగలను మూట గట్టిన పచ్చ పట్టు వస్త్రమూ, ఆమె ఇప్పుడు కట్టుకొన్న చీరా

రాలూ, మరి కొందరు విసన కర్రలూ పట్టు కున్నారు. ఒకతె తన కుడిచేతిలో మణి మయ మైన మద్యభాండం తీసుకున్నది, మరొకతె రావణుడి వెనుక నుంచి బంగారు కర్ర గల తెల్లగొడుగు పట్టింది.




వారందరూ అశోకవన ద్వారం దగ్గిరికి వచ్చే సరికి, చెట్టు మీద ఆకుల చాటున ఉన్న హనుమంతుడు వారిని చూశాడు.

రావణుడు ఇంకా అంత దూరంలో ఉండ గానే సీత భయంతో కంపించిపోయింది. ఆమె ముడుచుకుని కూర్చుని ఏడవసాగింది. కటిక నేల మీద కూర్చుని, భయపడి ఏడుస్తూ, దుమ్ము కొట్టుకుని ఉన్న సీతతో రావణుడిలా అన్నాడు:

''నన్ను చూసి ఎందుకు భయపడతావు, సీతా? ఇక్కడ నీకు హాని చేసే వారెవరూ లేరు. నేనా నీ మీది మోహంతో తపించి పోతున్నాను. కాని నీకు నా మీద కొంచెం కూడా ప్రేమ లేదు. ఎందుకిలా శోకిస్తావు? నన్ను నమ్ము, స్నేహ బుద్ధితో చూడు. తల దువ్వుకోక, మురికి బట్ట కట్టుకుని, అర్థం లేని ఉపవాసాలు చెయ్యటం నీ కెంత మాత్రమూ తగదు. కారి పోయిన నీటి లాగా పోయిన యౌవనం తిరిగి రాదు. భోగాలు అనుభవించు. నీ వంటి అందగత్తె సృష్టిలో లేదు. నన్ను చేపట్టితే నిన్ను అగ్రభార్యను చేస్తాను. ప్రపంచమంతా జయించి నీ తండ్రి జనకుడికి కానుకగా ఇస్తాను. అదృష్టహీనుడై, రాజ్యం పోగొట్టు కుని, అడవులలో అలమటించే ఆ రాము డింకా బతికి ఉంటాడా అని నా సందేహం. ఒకవేళ బతికి ఉన్నా అతడు నిన్ను చూడను కూడా లేడు. పూర్వం తన భార్యను ఇంద్రు డెత్తుకు పోతే హిరణ్యకశిపుడు నారదుడి చేత అడిగించి తెచ్చుకున్నాడు. రాముడి గతీ అంతే. అయితే అతను ఎంత వినయంగా అడిగినా నేను నిన్నివ్వను. కృశించి, మట్టి కొట్టుకుని ఉంటేనే నీ అందం నా మనస్సు హరించేస్తున్నదే, చక్కగా అలంకరించు కుని, మంచి బట్టలు కట్టుకుని, సంతోషంగా ఉంటే ఎలా ఉంటావో! హాయిగా తిను, తాగు, సుఖించు. నీ కేమిటి లోపం?''

ఈ మాటలు విని సీత ఒక గడ్డి పోచను తనకూ రావణుడికీ మధ్యగా పట్టుకుని, దీనస్వరంతో ఇలా చెప్పింది:

''నా మీది ఆశ వదులుకో. పాపిష్ఠి వాడికి మోక్షం ఎంత దుర్లభమో, నీకు నేనూ అంతే.



నేనింకొకడి భార్యను, పతివ్రతను. నీ భార్యలను ఇతరులు కోరితే నీకెలా ఉంటుందో ఆలోచించుకో. నీకు బుద్ధి చెప్పే వారెవరూ లేరో, లేక చెప్పినా నువ్వు వినవో! కాని నువ్వు చేసిన పని నీకూ, నీ రాజ్యానికీ, రాక్షస కులానికీ చేటు కలిగించేది. నాకు కావలసింది నీ అంతఃపుర స్త్రీలపై పెత్తనమూ కాదు, ధనమూ కాదు, ఇంకేదీ కాదు-నా భర్తవెంట ఉండటం. నాలుగు కాలాలపాటు సుఖంగా ఉండాలంటే నన్ను రాముడి దగ్గిర చేర్చు. రాముడితో స్నేహం చేసుకో. శరణన్న వారిని రాముడు క్షమించగలడు. లేదా, రామలక్ష్మణుల మూలంగా నీకు సర్వ నాశనం తప్పదు. నువ్వు పిరికిపందవు. రాముడు జనస్థానంలో ఉన్న రాక్షసుల నందరినీ చంపెయ్యటం చూసి భయపడి, రామలక్ష్మణులిద్దరూ బయటికి వెళ్ళి ఉండగా నన్ను దొంగిలించి తెచ్చావు. వారి గాలి ఏమాత్రం సోకినా, పులుల వాసన తగిలిన కుక్కలాగా నువ్వు పారిపోయి ఉందువు. అటువంటి రామలక్ష్మణులతో యుద్ధం పెట్టుకోకు.''

సీత ఆడిన ఈ పరుష వచనాలకు రావణుడు మండిపడి, ''నీవన్న ఈ మాటలలో ప్రతి ఒక్క మాటకూ నిన్ను చంపవచ్చును. కాని నీ మీది మోహం చేత నేనాపని చెయ్యలేకుండా ఉన్నాను. నేను చెప్పిన గడువింకా రెండు మాసాలున్నది. ఈ లోపల నా భార్యవు కావటానికి సమ్మతించక పోయావో, నిన్ను ఉదయపు ఫలహారం కింద వండించుకు తింటాను,'' అన్నాడు.

అతను సీత వెంట ఉన్న రాక్షస స్త్రీలతో, ''మీరు నయానో, భయానో ఈ సీత మనస్సు నా మీదికి మళ్ళేటట్టు చేయండి. ఆమె కిష్టం లేని పనులు చేయటానికి కూడా ఇప్పుడనుజ్ఞ ఇస్తున్నాను,'' అన్నాడు.

రావణుడి వెంట ఉన్న భార్యలలో దేవ గంధర్వ స్త్రీలు సీతను చూసి జాలిపడి, తమ సానుభూతిని ఆమెకు సంజ్ఞల ద్వారా తెలియజేశారు. రావణుడి కడగొట్టు భార్య అయిన ధాన్యమాలిని రావణుణ్ణి కౌగలించుకుని, ''ఈమెకు నీపై ఇష్టం లేదు. ఆమె పైన ఎందుకు లేని పోని ఆశ పెట్టుకుంటావు? ఆమెకు సుఖపడే గీత లేదు. అందుకే నిన్ను వరించటం లేదు,'' అన్నది.

రావణుడీ మాట విని చిరునవ్వు నవ్వి స్త్రీలతో సహా తన ఇంటికి తిరిగి వెళ్ళాడు.

అతను వెళ్ళిపోగానే రాక్షస స్త్రీలు సీతను మాటలతో హింసించారు, ఆయుధాలతో బెదిరించారు. కొందరు రావణుణ్ణి పొగిడారు. కొందరు రాముణ్ణి తిట్టారు. ''మేము చెప్పినట్టు చెయ్యకపోతే నిన్నిప్పుడే తినేసి, సీత చచ్చిపోయిందని రావణుడికి చెబుతాం,'' అన్నారు. ''మళ్ళీ పోట్లాడుకోకుండా దీన్ని ముందుగానే ముక్కలు ముక్కలుగా కోసి సమంగా పంచండి,'' అన్నది ఒకతె.

సీతకు ఒక వంక భయమూ, మరొక వంక అసహ్యమూ కలిగాయి. ఆమె తాను కూర్చున్న చోటి నుంచి లేచి శింశుపావృక్షం కేసి నడిచి ఒక అశోక వృక్షం కింద దాని కొమ్మ పట్టుకుని నిలబడి, తన దుస్థితిని గురించి తలుచుకుని బాధ పడింది. రామలక్ష్మణులు మరణించి ఉంటారా, రావణుడు వారిని ఈపాటికి చంపించి ఉంటాడా అని ఆమెకు కొంచెం సేపు అనుమానం కలిగింది. వాళ్ళు సన్యసించారేమోనని మరొకసారి సందేహించింది. రాక్షస స్త్రీలు ఆమెను చుట్టు ముట్టి ఇంకా భయపెడుతూనే ఉన్నారు.

ఇంతలో త్రిజట అనే ముసలి రాక్షసి అప్పుడే నిద్ర లేచి, పెద్దగా మూలుగుతూ, ''సీతను తినెయ్యకండర్రా, కావలిస్తే నన్ను తినండి. నాకొక భయంకరమైన కల వచ్చింది,'' అన్నది. రాక్షస స్త్రీలు ఈ మాటకు భయపడి, దాని చుట్టూ మూగి ఏం కల వచ్చిందని త్రిజట నడిగారు. త్రిజట ఇలా చెప్పింది:



''రాముడు తెల్లటి పూల మాలలు వేసుకుని, తెల్ల బట్టలు కట్టుకుని, దంతంతో చేసిన పల్లకీలో ఎక్కి, లక్ష్మణుడితో సహా, వెయ్యి హంసలు మోస్తుండగా ఆకాశ మార్గాన లంకకు వచ్చాడట. ఈ సీత తెల్లని చీర కట్టుకుని, సముద్రం మధ్య ఉండే శ్వేత పర్వతం మీద ఉన్నట్టు నాకు కలలో కనిపించింది. రామలక్ష్మణులు నాలుగు దంతాలు గల పెద్ద ఏనుగు నెక్కి లంకలో సంచరించటం కనిపించింది. ఆ రామ లక్ష్మణులు సీతను సమీపించారు. రాముడెక్కిన ఏనుగు శ్వేతపర్వత శిఖరం పైగా ఉంటే సీత దాని పైకి ఎక్కింది. తరవాత, రాముడి తొడ పైన కూర్చున్న సీత లేచి, చేతులతో సూర్య చంద్రులను పట్టుకుంటున్నట్టు కనిపించింది. ఆ తరవాత రాముడు ఎనిమిది తెల్ల ఎద్దులు లాగే రథం మీద సీతతో ఇక్కడికి రావటం చూశాను. సీతా రామ లక్ష్మణులు పుష్పక విమాన మెక్కి ఉత్తరంగా వెళ్ళటం నాకు కనిపించింది. ఇక రావణుడు గన్నేరు పూల మాలలు ధరించి, ఒళ్ళంతా నూనె పూసుకుని, ఎర్రబట్ట కట్టుకుని, తాగిన మత్తులో నేల పైన పడి ఉండటం కనిపించింది. ఇంకోసారి రావణుడు పుష్పక విమానం నుంచి కింద పడి, నున్నని, జుట్టు లేని తలతో, నల్లని బట్టలు కట్టుకున్న ఆడది ఈడుస్తున్నట్టు కనిపించాడు. మరొకసారి రావణుడు ఎర్ర పూల మాలలూ, రక్త చందనమూ ధరించి, నూనె తాగుతూ, నవ్వుతూ, నాట్యం చేస్తూ, మతిపోయి గాడిదలు పూన్చిన రథం పైన పోతూ కనిపించాడు. ఒకసారి రావణుడు గాడిద నెక్కి దక్షిణంగా పోతూ, దాని మీద నుంచి తల్ల కిందులుగా నేల మీద పడటం చూశాను. అక్కడి నుంచి లేచి అతను నోటికి వచ్చినట్టు దుర్భాషలాడుతూ ఒక బురద గుంటలో పడి మునిగి పోయాడు. కుంభకర్ణుడు కూడా ఇలాటి స్థితిలోనే కనిపించాడు. రావణుడి కొడుకులు శరీరంపై నూనె పోసుకోవటం కనిపించింది. లంకానగరంలోని సుందర భవనాలు జలప్రళయంలో మునిగిపోతూ కనిపించాయి. రాముడి దూత అయిన ఒక కోతి లంకను తగలబెట్టాడట. అందుచేత మీ అఘాయిత్యం చాలించి సీతతో మంచిగా ఉండండి, లంకకు చేటు రానున్నది.''





# పొరుగుపోరు

మాలతీ, నందనా మంచి స్నేహితురాళ్ళు. నందన తండ్రి పట్నంలో వ్యాపారం ప్రారంభించటంవల్ల వాళ్ళ కుటుంబం పట్నం వెళ్ళిపోయింది. స్నేహితురాళ్ళు విడిపోయేటప్పుడు, తప్పక పట్నం రమ్మని నందన మాలతికి మరీ మరీ చెప్పివెళ్ళింది.

మళ్ళీ నందనను కలుసుకోవాలనీ, పట్నం చూడాలనీ ఆత్రపడుతున్న మాలతికి ఒక నాడు పట్నం వెళ్ళే అవకాశం దొరికింది. ఆ ఊరి శ్రేష్ఠి ఒకాయన సొంత వ్యవహారం మీద పట్నం వెలుతూ, మాలతిని నందన ఇంటివద్ద దించటానికి ఒప్పుకున్నాడు. పట్నంచేరాక ఆ శ్రేష్ఠి ఆలస్యమవుతున్నదని, మాలతిని నందన ఇంటి సమీపంలో దించి, తన బండిని తోలించుకు పోయాడు.

మాలతి నందన ఇంటిని సులువుగానే కనుక్కున్నది. కాని నందన ఇల్లు తాళం పెట్టి ఉన్నది. మాలతి ఏం చెయ్యటానికీ తోచక, పక్క ఇంటికి వెళ్ళి, లోపలికి తొంగి చూసింది.

ఆ ఇంటి ఆడమనిషి, నడివయసు స్త్రీ, ''ఎవరమ్మా? ఏం కావాలి?'' అని మాలతిని అడిగింది.

మాలతి ఆమెకు తన పరిస్థితి చెప్పుకుని, ''నందన ఎక్కడికి వెళ్ళింది? ఎప్పుడు వస్తుంది?'' అని అడిగింది.

''బంధువుల ఇంట పెళ్ళి అని, ఇంటిల్లిపాదీ పొరుగూరు వెళ్ళారు. చీకటిపడి వస్తారు. అందాకా మా ఇంట్లో ఉందువుగాని. ఈ పట్నంలో ఒంటరిగా ఎక్కడ ఉంటావు?'' అన్నదామె.

మాలతికి ప్రాణం లేచివచ్చింది. ఆ పొరుగింటి ఆవిడకు ఒక కూతురు ఉన్నది. పేరు జానకి. జానకికీ, మాలతికీ తేలికగా స్నేహం కుదిరింది. జానకి తండ్రికి ఉద్యోగం ఏమీ

25-ఏళ్ళనాటి చందమామ కథ



లేదు. పెద్ద ఆదాయం ఏమీ ఉన్నట్టులేదు; అయినా వారు ఎంతో మంచి హృదయంతో, ముక్కూ, మొహమూ ఎరగని తనను ఆదరించటం చూసి మాలతి ఎంతో ముచ్చటపడింది.

పగలు జానకి మాలతిని పట్నం అంతా తిప్పి చూపించింది. ఆ సాయంత్రం జానకి స్నేహితురాలి పెళ్ళి విందు ఉన్నది. కనీసం జానకి అయినా వెళ్ళకపోతే బాగుండదు. కాని జానకి వెళ్ళటానికి బిడియపడింది.

''నేను వెళ్ళనమ్మా! ఆ పెళ్ళికి అంతా గొప్ప గొప్ప వాళ్ళు వస్తారు. కట్టుకోవటానికి మంచి చీర లేదు. మెడా, చేతులూ బోసిగా పెట్టుకుని నేను విందుకు వెళ్ళానంటే, మిగిలినవాళ్ళ మధ్య పనిమనిషిలాగుంటాను! నేను వెళ్ళనులే!'' అన్నది జానకి తన తల్లితో.

ఈ మాట వినగానే మాలతి జానకికి తన పెట్టె నుంచి పట్టుచీర తీసి ఇచ్చి, తన నగలు పెట్టి, ''ఇక పెళ్ళివిందుకు వెళ్ళిరా!'' అన్నది నవ్వుతూ.

జానకి అభ్యంతరం చెప్పకుండా విందుకు వెళ్ళింది.

చీకటి పడింది, పొద్దు పోయింది. పెళ్ళికి వెళ్ళిన చందన వాళ్ళకుటుంబం రాలేదు. విందుకు పోయిన జానకి తిరిగి రాలేదు. జానకిని తీసుకు వస్తానని బయలుదేరిన తండ్రి, గుమ్మంలో పడి ఉన్న కాగితం తీసి చదివి, వెర్రికేక వేశాడు.

మాలతి చప్పున వెళ్ళి, ఆయన చేతి నుంచి కాగితం తీసుకుని చదివింది. అది జానకి తన తల్లికి రాసిన ఉత్తరం. అందులో ఇలా ఉన్నది:

''అమ్మా, నగలు ఆడదానికి శత్రువులని ఈ రోజే తెలిసింది. విందు నుంచి వస్తూంటే, సందులో నలుగురు మనుషులు కత్తి చూపించి, నగలన్నీ ఒలుచుకుపోయారు. మాలతికి నా మొహం ఎలా చూపించేది? పరాయి సొమ్ము పెట్టుకున్నందుకు నాన్న నా గొంతు నులిమేస్తారు! అందుకే వెళ్ళిపోతున్నాను. నా కోసం వెతకవద్దు.''

మాలతి కళ్ళ వెంట నీళ్ళు తిరిగాయి. జానకి ఎక్కడికి వెళ్ళిఉంటుంది? ఏదైనా అఘాయిత్యం చెయ్యదు గద? నగలకన్న ప్రాణాలు విలువైనవి కదా!

ఉత్తరం చదివి జానకి తల్లి శోకాలు ఆరంభించింది. జానకి తండ్రి మాలతితో, ''అమ్మా, కాలక్రమాన నీ నగల ఖరీదు ఇచ్చుకుంటాను. జానకిని వెతికించే ప్రయత్నం నేను

చెయ్యలేను. నా దగ్గిర చిల్లిగవ్వ లేదు,'' అని కన్నీళ్ళు పెట్టుకున్నాడు.

''బాబుగారూ, నా నగల డబ్బు మీరియ్యా నవసరంలేదు. ముందు జానకిని వెతకడానికి మనుషులను పంపండి. నిన్న రాత్రి మీరు ఆశ్రయం ఇయ్యకపోతే, దొంగలు నా మెడ నుంచే నగలు కాజేసేవాళ్ళేమో!'' అన్నది మాలతి. జానకి తండ్రి జానకిని వెతకటానికి చీకట్లో పడిపోయాడు.

కాస్సేపటికి వీధిలో బండి ఆగిన శబ్ద మయింది. మాలతీ, జానకి తల్లీ ఆత్రంగా బయటికి వచ్చారు. నందన కుటుంబం వారంతా బండిలోనుంచి దిగారు.

పక్కగుమ్మంలో నిలిచి ఉన్న మాలతిని చూడగానే నందన ఆశ్చర్యంతోనూ, ఆనందం తోనూ వచ్చి కౌగిలించుకున్నది. తరవాత మాలతి ఆమె వెంట తన పెట్టెతోసహా వాళ్ళ ఇంటికి మారింది.

మాలతి లోపలికిరాగానేనందన, ''ముందు నీ పెట్టె తెరిచి, సామానంతా ఉందో, లేదో చూసుకో! నీకు ఆ దొంగల ముఠాయే దొరికిందా?'' అన్నది.

మాలతి నిర్ఘాంతపోయి, నందనకు జరిగిన దంతా చెప్పి, ''నువ్వు పొరబడుతున్నావు. వాళ్ళు చాలా మంచివాళ్ళు. పాపం, నా మూలంగా జానకి ఎటో వెళ్ళిపోయింది!'' అన్నది బాధగా.

నందన కటువుగా, ''ఎక్కడికీ పోదు! నిక్షేపంగా వాళ్ళ బంధువుల ఇంట ఉండి ఉంటుంది. ఇదంతా నాటకం! పట్నం



మోసాలసంగతి నీకింకా తెలీదు. మెత్తగానే గొంతులు కోస్తారు. ముఖ్యంగా వీళ్ళను గురించి చుట్టుపక్కల అందరికీ తెలుసు. ఏ మాత్రం ఏమరుపాటుగా ఉన్నా, గుడ్డలూ, గిన్నెలూ కాజేస్తారు. వీళ్ళ పోరు భరించ లేకుండా ఉన్నాం! దొంగలు నిలువు దోపిడీ చేసిన జానకికి ఉత్తరం రాయటానికి కలమూ, కాగితమూ ఎక్కడి నుంచి వచ్చి ఉంటుందో అని నువ్వు ఆలోచించావా? తేలికగా మోసపోవ టానికి వీళ్ళకు నువ్వు దొరికావు!'' అన్నది.

మాలతికి మండిపోయింది.

'నేను పల్లెటూరిదాన్ని కావచ్చు గాని, ఈ పట్నం మోసగాళ్ళ ఆటలు కట్టించలేక పోను! నాకు నీ సహాయం మటుకు కావాలి!'' అంటూ ఆమె నందన చెవిలో ఏదో చెప్పింది.

''తెలివైన దానివే! నీ ఎత్తు పారటానికి పెళ్ళి నుంచి మా వెంట వచ్చిన మా పిన్ని

కొడుకు సహాయపడతాడు. వాడు నాటకాల రాయుడేలే!'' అన్నది నందన.

ఊరంతా మాటు మణిగింది. మాలతి చీరకొంగు తల మీదికి లాక్కుని, జానకి వాళ్ళ ఇంటి తలుపు తట్టి, చీకట్లో నిలబడింది. జానకి తండ్రి తలుపు తీశాడు.

''ఇక ఇంటికి రావచ్చునా అని జానకి అడగమన్నది,'' అన్నది మాలతి గొంతు మార్చి.

జానకి తల్లి బయటికి వస్తూ, ''ఇదొకవెర్రి మాలోకం! ఆ మాలతి వెళ్ళిపోయేదాకా రావద్దని ముందే చెప్పాను. ఎప్పుడు రావాలో మేమే కబురుపెడతామని చెప్పు. ఇంతకీ నువ్వెవరు?'' అన్నది.

''నేను మాలతిని!'' అంటూ మాలతి వెలుగులోకి వచ్చి నిలబడింది.

భార్యాభర్తలిద్దరూ నోళ్ళు వెళ్ళబెట్టారు.

''మంచిగా కనిపిస్తూనే ఎంత నాటకం ఆడారు మీరు! నేను నగలు పోయాయని రక్షకభటులకు ఫిర్యాదుచేశాను. దొంగలను కూడా నేనే పట్టిచ్చాను,'' అన్నది మాలతి.

చీకటిలో ఆమె వెనకనే రక్షకభటుడి వేషంలో ఉన్న ''పిన్నికొడుకు'' ముందుకు వచ్చి, ''మీ ఆటలు కట్టాయి! ముగ్గురూ జైలు కటకటాలు లెక్కపెట్టుతూ కూర్చోండి,'' అన్నాడు కర్కశంగా.

రక్షకభటుణ్ణి చూసి భార్యాభర్తలు గజ గజలాడిపోతూ, ''మమ్మల్ని క్షమించు, మాలతీ! బుద్ధి గడ్డి తిన్నది! ఇంతకాలమూ పరువుగా బతికాం; మమ్మల్ని అవమానం పాలుచేయకు. నీ నగలు నీకు అప్ప చెప్పుతాం,'' అన్నారు.

తన నగలతోబాటు చుట్టుపట్ల ఇళ్ళలో దోచిన వస్తువులన్నీ బయటపెట్టితే గాని క్షమించనన్నది మాలతి.

వాళ్ళు అప్పటికప్పుడు జానకిని రప్పించి, మాలతి నగలూ, ఇతర దొంగ వస్తువులూ మాలతికి ఇచ్చేసి, తెల్లవారేలోపుగా ఇల్లు ఖాళీచేసి వెళ్ళిపోయారు.

''మాకు పోరుగుపోరు తప్పించినందుకు నీకు గొప్పవిందు చేస్తాను, మాలతీ!'' అన్నది నందన.



## మీ అభిమాన కథానాయకుడు

# ఆర్య మళ్ళీ వస్తున్నాడు!

రాజకుటుంబంలో జన్మించిన ఆర్య తొలిపుట్టిన రోజు నుంచే అజ్ఞాత యువరాజుగా మారిన వింత ఉదంతం 2003-'04 చందమామ పాఠకులు మరిచిపోలేరు. జయానంద ముని అరణ్యంలోని ఆశ్రమంలో జంతువుల మధ్య అతణ్ణి పెంచి పెద్ద చేశాడు. తాను సుమేధ రాజదంపతులు శాంతి దేవుడు-శాంతకుమారిల ఏకైక సంతానమని అతనికి తెలియ వచ్చింది. దుష్టుడైన సేనాధిపతి వీరసింహుడి కుట్రకు తన తల్లిదండ్రులు బలి అయ్యారనీ, శాంతిసుఖాలతో విరాజిల్లిన సుమేధరాజ్యం కష్టాల పాలయిందనీ గ్రహించాడు. శక్తియుక్తులతో దుర్మార్గుల దుండగాలను అరికట్టాడు. ప్రజల ప్రతినిధిగా పాలన సాగించ గలనని ప్రజలకు మాట ఇచ్చాడు!

ఆర్య సాహస కృత్యాలు అంతటితో అయిపోలేదు. అతడు మరెన్నో అద్భుత సాహస కార్యాలు చేశాడు. అవన్నీ అక్టోబర్ సంచిక నుంచి ప్రారంభం కానున్నాయి. ఇప్పుడే మీ కాపీలను రిజర్వ్ చేసుకోండి.

మరిన్ని వివరాలకు సెప్టెంబర్ సంచిక చూడండి.





# ముందు జాగ్రత్త

కామేశం తనకు ముందు జాగ్రత్త ఎక్కువని గొప్పలు చెబుతూంటాడు. పొరుగింటి రామేశానికి ఆ విషయమై ప్రతి రోజూ సలహాలిస్తే ఆయన బుద్ధిగా విని సరే అంటూంటాడు.

ఇలా ఉండగా ఒకసారి ఒక సాధువు గ్రామాధికారిని కలుసుకుని, ''ఊరికి గ్రహదోషం రానున్నది. ఆ కారణంగా పంటలకు చీడపట్టి నాశనమయ్యే ప్రమాదమున్నది. ఇంట్లో గ్రహశాంతి జరిపి, పూజలు చేసిన వారికి దోషం తొలగిపోయి ప్రమాదం తప్పుతుంది. రేపు వచ్చి పూజావిధానం చెబుతాను. ఆసక్తి ఉన్నవారందరూ ఉదయమే స్నానం చేసి శుచిగా రచ్చబండ వద్దకు వచ్చి నన్ను చూడండి,'' అని చెప్పి వెళ్ళాడు.

గ్రామాధికారి సరేనని ఆ మేరకు ఊళ్ళో చాటింపు వేయించాడు. ఆ చాటింపు విన్న రామేశం అంతా మూఢనమ్మకమంటే, కామేశం ఒప్పుకోకుండా, ''ఈ ప్రపంచంలో మనకు తెలియనివి చాలా ఉన్నాయి. సాధువు మన మంచి కోరే చెప్పాడు. అదీ కాక పూజ చేస్తే మనకు వచ్చిన నష్టమేంలేదు. నా మాట విని నువ్వూ రేపు రచ్చబండ వద్దకు రా,'' అని హితవు చెప్పాడు.

రామేశం సరేనని మరునాడు ఉదయమే స్నానం చేసి పూజామందిరంలో దేవుడికి దణ్ణం పెట్టుకుని, బయటకు వచ్చి కామేశాన్ని పిలిచాడు. అప్పటికింకా నిద్రలేవని కామేశం, పిలుపువింటూనే కంగారుగా లేచి, త్వరగా పళ్ళుతోముకుని, ఆదరా బాదరా బట్టలు మార్చుకుని బయలుదేరాడు. ఇద్దరూ రచ్చబండ వద్దకు చేరేసరికి అప్పటికే అక్కడ చాలా మంది ఉన్నారు. సాధువు ఇంకా రాలేదు.

అప్పుడు గ్రహదోషం వల్ల పంటకు చీడ పడుతుందనడం మూఢనమ్మకం అన్నాడొక

బాబి



పెద్దమనిషి. అందుకు రామేశం నవ్వి, ''ఇప్పుడీ చర్చ వృధా. సందేహాలుంటే సాధువును అడగవచ్చు. మహాత్ముల మాటలు విలువైనవి. ఒకసారి మా ఇంటికి వచ్చిన సాధువు, 'మనిషికి ముందు జాగ్రత్త అవసరం. అందుకే రేపటి పని నేడు, నేటిపని ఇప్పుడే చేయాలి' అన్నాడు. అది చాలా గొప్ప సందేశం. ఏమంటావ్ కామేశం!'' అంటూ అతని కేసి చూశాడు.

ఎప్పుడూ ఆయన్నేదో చిన్న బుచ్చాలనుకునే కామేశం వెంటనే, ''సాధువు చెప్పింది నీ కోసమే. నాకైతే ఆ విషయం ఎప్పుడో తెలుసు. అందుకే ఇప్పటికే వృద్ధిలోకి వచ్చేశాను,'' అన్నాడు కామేశం.

''నువ్వన్నది నిజమే. మన ఊరికి నిన్న విత్తనాలమ్మేవాడు వస్తే, ఇవాళ కొనవచ్చులే అనుకున్నాను. కానీ అన్నీ అమ్ముడైపోయి, వాడు నిన్ననే వెళ్ళిపోయాడట. ముందు జాగ్రత్త విషయంలో సాధువు సందేశం విన్నానే తప్ప, ఆచరణలో పెట్టలేదు. అందుకు శిక్షగా విత్తనాల కోసం రేపు పొరుగూరు సంతకు వెళ్ళాల్సిందే. తప్పదు మరి,'' అన్నాడు రామేశం నవ్వుతూ.

ఈ మాటలకు అక్కడున్న సూరయ్య అనే రైతు ఆశ్చర్యపడి, ''అరె, నువ్వింకా విత్తనాలు కొనలేదా? నిన్న కామేశం నాలుగు కుంచాల విత్తనాలు కొన్నాడు. తనకు కావలసినవి రెండు కుంచాలే కదా. మిగతా రెండూ నీ కోసం కొన్నాడనుకున్నాను. మీరిద్దరూ ఇరుగూ పొరుగూ కదా!'' అన్నాడు.

రామేశానికి దక్కనివ్వకూడదనే తాను అదనపు విత్తనాలు కొంటే, అది సూరయ్య ఇలా బయటపెడతాడని ఊహించని కామేశం గతుక్కుమని, ఆ విషయం కప్పిపుచ్చడానికి, ''మాకూ మాకూ గొడవపెట్టాలని కాకపోతే–నాకు ముందు జాగ్రత్త ఎక్కువని తెలుసు కదా! ఆ రెండు కుంచాల విత్తనాలు వచ్చే యేటి కోసం,'' అన్నాడు.

రామేశం ఆప్యాయంగా కామేశం భుజం తట్టి, ''మనమధ్య గొడవ లెందుకువస్తాయి. నీ సంగతి నాకు తెలుసుకదా. అందుకే నువ్వు అదనంగా విత్తనాలు కొన్నావని తెలిసినా నాకిమ్మని నిన్నడగ లేదు,'' అన్నాడు.

అందుకు కాస్త ఇబ్బందిపడ్డ కామేశం ఏమనాలా అని ఆలోచిస్తుండగా అక్కడికి సాధువు వచ్చాడు.

ఆయన సమావేశమైన గ్రామస్థుల్ని చూసి, ''గ్రహాల స్థితి గతుల వల్లే ఈ భూమి మీద విశేషాలన్నీ జరుగుతున్నాయి. నా మాటను మూఢనమ్మకమని కొట్టి పారేయకుండా ఇంతమంది రావడం నాకెంతో సంతోషంగా ఉంది. నేనిప్పుడు మీ అందరికీ, ఒక్కొక్కరికీ ఒకటి చొప్పున మంత్రించిన ధాన్యం గింజ లిస్తాను. వాటిని గుప్పిట్లో ఉంచుకుని ఇంట్లో దేవుడి విగ్రహం ముందు నూట ఎనిమిది సార్లు పంచాక్షరీ మంత్రాన్ని జపించిన వారికి గ్రహదోషం తొలగిపోతుంది. మీరందరూ స్నానం చేసి శుచిగా వచ్చారు కదా! స్నానం చేయని వారికి గింజనిస్తే బెడిసి కొడు తుంది,'' అన్నాడు.

వెంటనే అక్కడున్నవారిలో కామేశంతో సహా పదిమంది స్నానం చేయలేదని భయ పడి వెనక్కి తగ్గారు.

సాధువు వాళ్ళను చూసి, ''కలవర పడ కండి. గ్రామాధికారికి కొన్ని అదనపు గింజలి స్తాను. ఆయన పూజ అయ్యాక మీరు వాటిని ఆయన నుంచి తీసుకుని సత్ఫలితం పొంద వచ్చు,'' అని అక్కడున్న తక్కిన వారందరికీ తలొక గింజా ఇచ్చి, కొన్ని గింజలు గ్రామాధి కారికి అదనంగా ఇచ్చివెళ్ళాడు.

అప్పుడు సూరయ్య కామేశం కేసి హేళ నగా చూస్తూ, ''నీ ముందు జాగ్రత్త ఏమ యింది? సమయానికి స్నానం చేసి వచ్చి ఉంటే నేరుగా సాధువు నుంచే ధాన్యం గింజ తీసుకునే వాడిని కదా?'' అన్నాడు.

రామేశం వెంటనే, ''అయ్యో, సాధువు నుంచి ధాన్యం గింజ తీసుకోని వాళ్ళలో మా కామేశం కూడా ఉన్నాడని నాకు తెలియదు. స్నానం నియమం మిగతా వాళ్ళకు వర్తిస్తుందే మోగాని, ఆయనకు వర్తించదని సాధువుకు చెప్పి, ఆయన చేతే గింజ ఇప్పించే వాణ్ణి. ఎందుకంటే మా కామేశానికి ముందు జాగ్రత్త ఎక్కువ కదా. నేటి స్నానం నిన్ననే చేసేశాడు,'' అన్నాడు.

ఆ మాట విన్నవారందరూ ఘొల్లుమని నవ్వారు. రామేశం చేతిలో మరోసారి భంగపడ్డ కామేశం–ఆ తరవాత ఎన్నడూ, ఎవరి వద్దా ముందు జాగ్రత్త గురించి మాట్లాడలేదు.



# చందమామ క్విజ్ - 7

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

Co-sponsored by
Infosys FOUNDATION, Bangalore

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. 250లు.*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు 50 రూ.లు బహుమతిగా ఇవ్వబడుతుంది.

ఈ నెల క్విజ్ భారతదేశ నాణాలు, స్టాంపులకు సంబంధించినది

మీరు చేయవలసిందేమంటే : 1. సమాధానాలు రాయండి. 2. మీ పేరు, వయసు (16 ఏళ్ళలోపు ఉండాలి) పిన్‌కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి. 3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి. 4. కవరు మీద చందమామ క్విజ్-7 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి. 5. ఆగస్ట్ నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి. 6. అక్టోబర్ 2008 నెల సంచికలో ఫలితాలు వెలువడతాయి.




1. ఒక మొగల్ చక్రవర్తి రాముడు, సీత చిత్రాలుగల నాణాలను వెలువరించాడు. ఆయన ఎవరు?
2. భారతీయ ద్రవ్యమానానికి రుపియా (రూపాయి) అని పేరు పెట్టిన వారెవరు?
3. బ్రిటిష్ పాలనలో మొట్టమొదట ఎప్పుడు నాణాలు వెలువరించబడ్డాయి?
4. స్వతంత్ర భారతదేశం ప్రథమంగా ఎప్పుడు నాణాలను వెలువరించింది?
5. ఈస్టిండియా కంపెనీ ఇంగ్లాండు రాజు చిత్రంతో నాణాలను వెలువరించింది. ఆ రాజు ఎవరు?
6. ఈస్టిండియా కంపెనీ నెలకొల్పిన తపాలాకార్యాలయాలు మొదట ప్రభుత్వ ఉపయోగానికి మాత్రం ఉండేవి. సాధారణ ప్రజానీకానికి అవి ఎప్పుడు అనుమతించ బడ్డాయి? పోస్టేజ్ విలువ ఎంత?
7. మనదేశంలో ఎప్పుడు తపాలా బిళ్ళలు మొదట వెలువరించబడ్డాయి? వాటిని ఏమని పిలిచేవారు?
8. దేశవ్యాప్త ఉపయోగానికి ఎప్పుడు తపాలా బిళ్ళలు వెలువరించబడ్డాయి? వాటి విలువ ఎంత?

# వార్తలలో బాలలు

## ఏనుగుతో స్నేహానుబంధం



జర్మనీకి చెందిన పూజ ఎనిమిదేళ్ళ అమ్మాయి. తరచూ ప్రపంచ పర్యటన చేసే కార్‌స్టన్, జెస్సికా ఆమె తల్లి దండ్రులు. వాళ్ళు ఇండియా నుంచి నేపాల్‌కు చేరిన ప్పుడు పూజ పుట్టింది. మూడేళ్ళ ప్రాయంలో పూజ తల్లిదండ్రులతో ముదుమలై అభయారణ్యానికి వెళ్ళి, అక్కడి అందమైన ఏనుగును చూసి దాన్నెంతో ఇష్టపడ సాగింది. శాంతి అనే ఆ ఏనుగు అందం, స్నేహస్వభావం పూజకు ఎంతగానో నచ్చాయి. ఇది జరిగింది 2005లో. ఆ తరవాత ఆ ఏనుగును తిరుచిరాపల్లి సమీపంలోని తిరువానైకోయిల్‌లోని అఖిలాండేశ్వరి ఆలయానికి తరలించారు. పూజ తల్లితండ్రులు కూతురితో కలిసి యేడాదికోసారి ఆలయానికి వచ్చి ఏనుగును చూసి వెళుతూంటారు. కూతురికీ, ఏనుగుకీ మధ్య ఉన్న స్నేహానుబంధాన్ని చూసి వాళ్ళు ''పూజ, ది ఎలిఫెంట్ గర్ల్' అనే పుస్తకం రాశారు.

### చందమామ క్విజ్ - 5 (జూన్ '08)

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఎంట్రీలు పాఠకుల నుంచి ఒక్కటీ రాలేదు. అందువల్ల బహుమతి ఇవ్వలేకపోతున్నాం.

# ఫోటో వ్యాఖ్యల పోటీ


MAHANTESH C. MORABAD

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.


MAHANTESH C. MORABAD



వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు అక్టోబర్ 2008 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.
ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, జెవిఎల్ ప్లాజా 6వ అంతస్తు, 626, అన్నాసాలై, తేనాంపేట, చెన్నయ్ - 600 018

## అభినందనలు

జూన్ నెల పోటీ ఫలితాలు
తరుణ్ వేముగంటి
తం.పే: వి.కే. ప్రసాద్, 302, సామాటవర్స్,
సలీంనగర్, మలక్ పేట,
హైదరాబాదు - 500 036
(ఆం.ప్ర.)

ఫోటో వ్యాఖ్యల పోటీ:




మొదటి ఫోటో : విశ్రమిస్తే చేరవు గమ్యం!
రెండవ ఫోటో : శ్రమిస్తేనే బ్రతుకు ధన్యం!

## సమాధానాలు :

1. సూర్యభగవానుడు 2. సరస్వతి 3. కామధేనువు
4. భగీరథుడు 5. వాయుదేవుడు 6. విభీషణుడు

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 26 on behalf of Chandamama India Limited, JVL Plaza, 6th Floor, 626 (Old 501), Anna Salai, Teynampet, Chennai - 600 018. Editor : B. Viswanatha Reddi (Viswam)

# Friends can win you prizes!




Attach a photo or a sketch of yourself and a friend, tell us what friendship day means to you and you can win some funky prizes!

## Here's what the winners get

* First prize: nokia music express
* 5 second prizes: ipod shuffles
* 10 third prizes: mp3 players
* 100 Friends DVDs




BSA LADYBIRD
Your best friend for life.

Contest forms available at BSA go stores and Hercules BSA zones. You can also visit www.ticyclesindia.com or BSA Ladybird your best friend for life communities on Orkut, Bigadda and Facebook to participate online.

Contest closes 10 August 2008

CHANDAMAMA (Telugu) August 2008 Registrar of Newspapers of India No. 1114/57. Regd No. TN/CC(S)Dn/159/06-08
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/06-08, Foreign No. 85/06-08



# బుబ్బా సాహసాలు




ఒక క్రికెట్ బంతి ఇంటిలోపలికి దూసుకుపోయి...



...అక్కడున్న మనిషి కాలికి తగిలింది. ఆ మనిషి కోపంతో దాన్ని చూశాడు.




పిల్లలు బంతి కోసం గేటు తెరిచారు.




ఇదంతా చూస్తున్న బుబ్బాలూ, వాళ్ళకు సాయంచేయాలనుకున్నాడు.




పిల్లలు నీలి ద్రవాన్ని తమ నోళ్ళలోకి పిండుకున్నారు.




ఆ మనిషి కత్తి తీసుకుని బంతిని రెండు ముక్కలుగా నరకబోయాడు. అప్పుడు...



ఆఁహ! ఏమిటా నీలి నాలుక?



ఎటు చూసినా పిల్లలే కనిపిస్తున్నారేమిటి?



బుబ్బాలూ బ్లూ బెర్రీ! మీ నాలుకకు రంగులు పులిమే న్యూ బబుల్‌గమ్!

